# శ్రీ అనంత భాస్కర శతకం



యన్.వి. అనంతకృష్ణ

శ్రీ అనంత భాస్కర శతకం

ప్రథమ ముద్రణ -
శ్రీ విజయ ఆశ్వీజం, అక్టోబర్ 2013

రచయిత : ఎన్.వి.అనంతకృష్ణ

వెల : అమూల్యం



ప్రాప్తి స్థానము :
ఎన్.వి.అనంతకృష్ణ
ప్లాట్ నెం.80, శ్రీ సాయి నగర్,
రోడ్డు నెం.4, శ్రీ సాయిబాబా గుడి ఎదురుగా,
నాగోల్ పోస్ట్, హైదరాబాద్ - 500 068.
ఫోన్- 92465 31895.

# మంత్రమూలం గురోర్వాక్యం

చి॥ అనంతకృష్ణ రచించిన లలితా దేవి యొక్క స్తవరూపమైన శతకమును చూచితిని. అతి లలితమైన పదముల సమూహముతో, సమాస భూయిష్టమై అన్వయ కాఠిన్యమును లేక, మిక్కిలి చెవులకింపైన పరిశుద్ధమైన అచ్చతెనుగు పదములతో ధారాశుద్ధి గలిగి లలితా స్తవమును రచించిన మా శిష్యునికి శతాయువు లొసంగి నిత్యోన్నత స్థితిని కల్గించవలసినదని మదీయ యిష్టదైవమైన శ్రీమన్మహారాజరాజేశ్వరీ షోఢాంబా జగన్మోహినీ పరదేవతా శ్రీమహా త్రిపుర సుందరిని ఆశీస్సులిమ్మని కోరుకుంటూ..

ఇట్లు

**పరమానందనాథ దీక్షానామాంకిత**
**విద్వాన్ రాళ్లభండి సుబ్రహ్మణ్య దీక్షితులు**
తేదిః 16.6.2002

# అర్ఘ్య ప్రదానం

సాహితీ లోకంలో ప్రతి క్షణం ఒక శతకం ఆవిర్భవిస్తూ ఉంటుందని అభిజ్ఞుల ఉవాచ. ఈ శతకాలను సహృదయ పాఠకులు సమాదరిస్తూ సమాహ్వానం చేస్తుంటారు. శతకంలోని పద్యాలు దేనికవే ఒక్కక ముక్తకమై రసం చిప్పిలుతూ ఉంటాయి. ఈ శతకాలను హృదయస్తం చేసికొని తరువాతి తరాలకు కూడా అందించడం తెలుగు వారికున్న ప్రత్యేక లక్షణం అందుకే అన్ని శతకాలు ఆవిర్భవించడం అలా ఆవిర్భవించినదే ఈ శ్రీ అనంత భాస్కర శతకం. భాస్కర శతకం శ్రీ మారద వెంకయ్య రచన . అది సుప్రసిద్ధమై తెలుగు వారి నాల్కల పై, నర్తిస్తూ ఉంది. భాస్కరా అనేది ఆ శతకానికి మకుటం. లోకం లో మానవ జీవన విధానం అందులో చెప్పబడింది కానీ ఈ అనంత భాస్కర శతకం శ్రీ సూర్య నారాయణ స్వామిని ఉద్దేశించి సాగిన రచన . రచయిత శ్రీ అనంతకృష్ణ న్యాయవాది . ఇప్పటికే రెండు గ్రంధాలు వెలయించారు ఆ రెండు దైవ సంబంధమైనవే లలిత పై , వినాయకునిపై రచనల తదుపరి ముచ్చటగా సాగిన మూడవ రచన. ఇది పంచాయతన పూజ అని ఒక పూజా విధానం ఉంది ఆదిత్య ,అంబిక విష్ణు గణనాధ మహేశ్వరుల పూజ ఇందులో ప్రధానం గణపతి ,లలితల తరువాత ఆదిత్యునిపై శతకం వ్రాసిన ఈ కవి భావిలో విష్ణు మహేశ్వరులపైనా శతకాలు వ్రాస్తారని అశించ వచ్చు . ఈ శతకానికి మకుటం ఎత్తు గీతిలో రెండు పాదాలు మకుటం జాగ్రత్తగా పరిశీలిస్తే ప్రసిద్ధమైన రెండు సూర్య మంత్రాలు కనపడతాయి ఈ శతకాన్ని ఒకసారి పూర్తిగా చదివితే రెండు వందల మార్లు సుర్యమన్త్ర జప ఫలితం లభిస్తుంది ఇది నిర్వివాద అంశం . రచయిత ఆధ్యాత్మిక మార్గ గామి ఎన్నో ఉపాసనా రహస్యాలు ఎరిగిన సాధకుడు అందుకే వీరి ఈకవితలో ఆధ్యాత్మిక పరిమళాలు గుబాలిస్తూ చదువరులకు ఆనందం పంచి అలౌకికానుభూతి కలుగుతుంది. ఈకవి తన పాండిత్య ప్రతిభను చూపడానికి వ్రాసిన శతకం కాదిది అలా అందామంటే పాండిత్యానికి గాని ,కవితాధారకు గాని రవంత కూడా లోటు రాని ప్రతిభ వీరిది. చిత్రకవిత్వం ,బంధకవిత్వం ఈ శతకం లో దర్శనం ఇస్తాయి 6వ పద్యాన్ని ఒకమారు చూద్దాం . ఎత్తుగీతిలో చీడలన్నిటి మొదలంట చిదిమివైచి అనివుంది. స్వామీ మాచీడలు మొత్తం పోగొట్టు అనడంతోబాటు సీసం లో మొదటి నాలుగు పాదాల లోఉన్న పిలువ కొలువ తలువ విలువ అనే మొదటి పదాలు తీసివేస్తే ఆ వెంటనే ఉన్న

పదాలు కలిపితే ప్రసిద్ధ సూర్య మంత్రాన్ని ఉద్ధరించ వచ్చు మొదలంట చిదిమి వైచి అనే మాటలో దాగిన భావం ఇది ఇలా ఉంటాయి వీరి పద్యాలలో రహస్యాలు 31వ పద్యం "నిస్సార కాసార .......... "వంటిపద్యాలు వారి పాండిత్యానికి తార్కాణాలు. 35వ పద్యాన్ని జాగ్రత్తగా చూస్తే సూర్యుని ద్వాదశ నామాలు కన్పిస్తాయి 36వ పద్యం అంకెలతో ఆటలాదినట్లే ఉంటుంది . ఇలా వివరిస్తూ పోతే ప్రతి పద్యం మంత్ర ప్రపూతమైనరీతిగా కనపడతాయి వాచవిగా కొన్ని పద్యాలు మాత్రమే చూప బడ్డాయి వీరి కవితా భాస్కరునకు అర్ఘ్యప్రదానం చేసి వీరిపద్య శతమ్ తో భాస్కరార్చన చేదాం సుర్యానుగ్రహాన్ని పొందుదాం రండి.

చం॥
అరుదగు భావనా బలము నందిన శబ్దము లుప్పతిల్లగా
వరమగు సత్కవిత్వమును ప్రాజ్ఞులు మెచ్చగ పూష మెచ్చగా
సరస గతిన్ రచించిన ప్రశస్త పదాన్విత "శ్రీ అనంత భా
స్కర శతకమ్ము "విజ్ఞులకు సంతసమిచ్చి శుభమ్ము గూర్చుతన్

బుధజనవిధేయుడు
అవధాన రాజహంస, సహస్రావధాని
**కోట వేంకట లక్ష్మీ నరసింహం**

తేదిః 21.10.2013 తణుకు.

# అభినందన మందారం

‘శ్రీ అనంత భాస్కర శతక’ కర్త  శ్రీ నారుమంచి వేంకట అనంత కృష్ణ  గారు నాకు సుపరిచితులు. ఇంతకు ముందు వీరు 168 శ్లోకములతో గురుసహస్ర నామావళిని, ”లలిత పదముల మది లలిత గొలుతు” అనే మకుటముతో  ఒక శతకము, “వరసిద్ధి వినాయక భక్త పాలకా” అనే మకుటముతో ఒకశతకము రచించి యుండిరి. ఈవిషయమును 103 వ పద్యమున కవే చెప్పిరి. వీరి శతకరాజములు ఆంధ్రామృతము http://andhraamrutham.blogspot.com అను బ్లాగున ప్రచురింపఁబడి పాఠకుల మన్ననలందుకొన్నవి. పద్య రచనలో స్థిత ప్రజ్ఞులు. ఐహికమగు రచనా వ్యాసంగముతో ఆముష్మికమును సాధించుటకు వీరు చేయుచున్న ప్రయత్నము వీరి రచనలో గోచరించును. ఐహిక వాంఛా దూరులై పరమాత్మతో తాదాత్మ్యము పొందుతూ పరమాత్మకు వీరు చేసుకొనుచున్న విన్నపము ప్రత్యక్షర సత్యమై శతక బద్ధమైయున్నది.

శ్లో: ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్   –  శ్రియమిచ్ఛేద్ధుతాశనాత్.
జ్ఞానం మహేశ్వరాదిచ్ఛేత్.  –  మోక్షమిచ్ఛేత్ జనార్దనాత్.

అని ఆర్యోక్తి. ఇందలి సత్యగ్రాహకులైన మారద వెంకయ్య  కవి మున్నగు వారు భాస్కర శతకాది నామములతో సూర్య సంబంధమైన పెక్కు శతకములు విరచించి ధన్యజీవులైనారు. అందు మారద వెంకయ్య కవి కృత భాస్కర శతకము దృష్టాంతాలంకారాలంకృతమై యున్నందున నేటికినీ ప్రజల నాల్కలపై నానుచుండుట విశేషము. ఈ నాటి మన కవి అనంత కృష్ణ గారు కూడా తనకు గల అపార కవితా ప్రాభవముతో చిత్ర , బంధ, నామ గోపనాది చిత్ర కవితా వైచిత్రీ ప్రాభవముతో శతకము మొత్తము వ్రాయు సమర్ధులయ్యును, భక్తి భావనాభరితమగు సీసములను వెలయించుచు అటనట కొన్ని పద్యములలో తనకు గల చిత్ర కవితకు మచ్చు తునకలుగా చెప్ప దగిన పద్యములను ఈ శతకమున వ్రాసి, భక్తుల మనములతోఁ బాటు కవితానురక్తులగు మహా కవుల హృదయములను సహితము చూఱకొనిరి. శ్రీ కారముతో నారంభించిన యీ శతకము   సీస సంభరితము కాగా సీసాంతమునుండు తేట గీతిలో చివరి రెండు పాదములందు మకుటమునుంచిరి

భాస్కరాదిత్య ! ఘృణి సంజ్ఞ! భక్త వరద!
దివసకర! వరేణ్య ! సవితా! తిగ్మ కిరణ!

ఈ మకుటమునందు ఆ సూర్య భగవానుని నామములు తప్ప మరొకటి లేకుండుట గమనించినచో ఈ కవికి గల భక్తి తత్పరత వ్యక్తము కాక మానదు. ఈ లోకము యొక్క సృష్టి, స్థితి, లయలకు మూలము బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు కాగా ఆ మూడు మూర్తులూ ప్రత్యక్ష సాక్షి సూర్యభగవానుఁడే యని ఆర్యోక్తి.

ఉదయం బ్రహ్మ స్వరూపం - మధ్యాహ్నంచ మహేశ్వరం, సాయంకాలే సదా విష్ణుం - త్రిమూర్తిశ్చ దివాకరః . మనకవి ఇందలి సత్య గ్రహణ పారీణుఁడగుటను చేసి రెండవ పద్యములో ఈ విషయమును సోదాహరణముగా వివరించి, "మూడు మూర్తులు నీవైన మూల పురుష - నిజము నెఱుఁగంగ మనసార నిన్ను కొలుతు" అని తెలిపి యున్నారు. కవిగా తాను తరించుటయే కాక తన పుత్ర పౌత్రాది భక్త బాంధవాది జనుల నామములనంతర్లీనముగా ఉంచి పరమాత్మతో సీసములలో ముచ్చటించుట చూచినచో ఎట్టివారికైనా అబ్బురము కలుగక మానదు. 8 వ, 13 వ, 49 వ పద్యములలో "సరోజ - శర్మ - అనంత - వనజ - కౌశిక్ - శృతి కీర్తి - అపర్ణ - రఘురామ మూర్తి - కుమారి - పాండు - గీత - భరద్వాజ - కశ్యప - హాసిని - సహస్ర కౌముది " మున్నుగా కల వారి బంధువుల నామములు మనము గమనించ వచ్చును. వీరు రచించిన సాధారణమగు సీసములలో అసాధారణ మగు ఘృణి సూర్య ఆదిత్య ఓం అనే పదముల సమాహారము "మూల శక్తి" గా కనపడును. 6 వ పద్యము దీనికి నిదర్శనము. ఈ కవి గర్భ కవితా ధురీణుఁడనుటకు ఈ క్రింది పద్యమే తార్కాణము. గమనింపుడు.

సీ: మాయను జిక్కుట మది నూహ జేయుగా - రానిది తగులగ
రాదనంచువారింప శక్యమే, వాక్కున పల్కుటె - టుల, నిశ్చల గతులన్
గలుగు టెటుల దాయక తెల్పుము తదుపాసనా సుసా - ధ్యమ్మది చెందగ
నెమ్మది గొననీయనుకంపయౌ నిర్గుణ సత్యము - తృటినందెడివిధమున్
తెలియనెంతు
గీ: ఆటుపోటులఁ జిక్కక నటునిటులను - బారక గమనమాగని బాట జూపు
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద - దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ
14 ఈ పద్యమును పఠించునెడ మనకు సీసముగనే తోచును కాని ఇందు ఒక

కంద పద్యము గర్భితమై యున్నదను విషయము చెప్పిన గాని తెలియదు. ఇందలి కంద పద్యమును గమనింపుడు.

సీస గర్భస్థ కందము:

మది నూహ జేయగారా
నిది వాక్కున పల్కుటెటుల, నిశ్చల గతులన్
తదుపాసనా సుసాధ్య
మ్మది నిర్గుణ సత్యము తృటినందెడివిధమున్.

పద్య రచనమున పారమంటిన కవులు చేయు ప్రక్రియ చిత్ర కవిత యని సాహితీ వేత్తల భావన. అక్షర నియమమును బట్టి

(1)ఏకాక్షర చిత్రము - (2)ద్వ్యక్షర చిత్రము - (3)త్ర్యక్షర చిత్రము - (4)చతురక్షర చిత్రము అను నాల్గు ప్రక్రియలను మన కవి నాలుగు పాదములందు చూపియున్నారు.

సీ: నేను నేనను నేను నేనని నేననన్ - నేనన్న నేనన్న నిన్ను నిన్నె(1) నా
మనమన్న నీ నామమ్మనిన్ నమ్ము - నీ నామ మననమ్ము నెమ్మి నిమ్ము (2)
సుమ సమానము మానసమనుమానము మాని - నా మనో సుమమాసన
మనుమన్న(3) నీ యెద దాగని నీ దయ నేగొందు - నాదగు నయ్యది
నాదెయందు(4)

గీ: వేనవేల మాటలవేల వేడికొందు - నెల్ల వేళల నుండు నా యుల్లమందు
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద - దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 85

చిత్ర బంధ రచనా దక్షులయిన మన కవి 100 వ పద్యముగా రథ బంధ సీసమును రచించెను. అందు కవి నామము - గ్రంథ నామము నిక్షేపించుటను వీరికి గల చిత్ర కవితా పాటవమునకు తార్కాణముగా చెప్ప వచ్చును. గమనింపుడు.

రథ బంధం

మధ్య నిలువు " అనంత కృష్ణ భాస్కర శతకము"

సీ: అవునంతియే గీతలన్నియు స్వీయాక్ళ - తిం దప్పి యే మృగతృష్ణ వెంట
పరువెత్తి సోలక భాసుర పరిపూర్ణ - నిరుపమహస్కర నియతి నిల్పుశు
భచిహ్నా సారమై శోభావహమ్ములై - నిల్చు శక్తిని పొంద నీదగు దయ
తప్ప యితరమెద దలప కన్పట్టదు - ముఖ్య గుణమటుల ముఖము పైన

గీ: ముచ్చట నుదుట వ్రాయక మునుపు దేవ - నతులు గొని సమ్మతిని జూపుమతులితముగ భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద - దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 100 అనంతుఁడగు ఆ దినకరుఁడే అనంతుఁడయ్యెనో యేమో గాని, అనంత కృష్ణ కవి మాటల మేళనమునందు కూడా దినకర మంత్రమునే ప్రభవింప జేసినారు. 23 వ పద్యమున గల వీటిని గమనింపుడు.

అందిన కరమందుకొందనిన్ - పొందిన కరదీప - కుందిన కరవాల - భయమొందిన కరణి.

ఈ కవి కవితా భేషజము ఈ క్రింది పద్యము వలన తెల్లమగుచున్నది. దారిద్ర్య దుఃఖాలు దరిదాపులకు రావు అని భరోసా యిచ్చుచూ, అందులకు ఏమి చేయ వలెనో ఈ క్రింది పద్యమున వివరించిరి. చూడుడు.

సీ: రాగి చెంబెడు నీట రక్త చందనముంచి - ఎర్ర గన్నేరులనెంచి యుంచి
దూర్వాంకురములుంచి తోడునక్షతలుంచి - కుదురుగా చేపట్టి నుదురుకాన్చి
మోకాళ్ళ పై నిల్చి ముదమార నిను తల్చి - హంసాది నామాల నర్ఘ్యమీయ
దారిద్ర్య దుఃఖాలు దరిదాపులకు రావు - వాని జేరగలేవు వ్యాధులసలు

గీ: నీటితో పూజించ మురిసి కన్నీటినంత - చేత తుడిచెడి నిను గొల్తు చేతులెత్తి
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద - దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 79

సకల దీప్తుల దీపించు శక్తివీవు అని సూర్య భగవానుని 80 వ పద్యమున నిరూపించిన తీరు గణనీయము.

శ్రీమదనంత కృష్ణ కవి తన శ్రీ అనంత భాస్కర శతకమును ఆ సూర్య భగవానునకే అంకితము చేయుచూ 102 వ పద్యమున ఆ పరమాత్మను గైకొమ్మని అర్పించిరి.

త్రికరణ శుద్ధిగా సూర్య భగవానునకే అంకితమయిన యీ కవి తాను రచించిన శ్రీ అనంత భాస్కర శతకము ఆ సూర్య భగవానునకే అంకితమిచ్చి కృతకృత్యులైరని చెప్ప వచ్చును.

శ్రీఅనంత కృష్ణ కవివరుని మనసారా అభినందించుచున్నాను.

సప్త వింశత్యధిక ద్వివిధ కంద – గీత గర్భ చంపకమాల:-

ఘృణి ధరుఁడై సదా! కవికి శ్రీకరముల్ రవి కాంచ చేయగా
మునివరుఁడై మదిన్ నిరతమున్ వరభాస్కరునే గణించె. భా
వన వరుఁడే కదా!.అమృత భాస్కర తేజుఁడనంత కృష్ణ సా
ధన గురుఁడై భువిన్ హరి సుధార్త రమాన్వితుడై సుఖించుతన్.

మంగళప్రదుఁడగు ఆ సూర్య భగవానుఁడే ఈ కవికి నిత్యము సర్వమంగళ కారకుఁడగును గాక.

స్వస్తి.

**చింతా రామ కృష్ణా రావు**
( సెల్ – 9247272960 )
తే.21-10-2013.
మియాపూర్.
భాగ్యనగరము.

# అనంత భాస్కర రశ్మి

సూర్యారాధన అతి సనాతనమైనది. సూర్యుడు ఆద్యంత రహితుడు. అనంతకాంతి సంశోభితుడు. ప్రత్యక్ష నారాయణుడు. భారతీయతకు మూలకందమైన వేదాలు సూర్యుని పలు విధాలుగా కీర్తించాయి. ఉపనిషత్తులలో మొదటిదైన ఈశావాస్యోపనిషత్తు సూర్యుని దైవత్వాన్ని కొనియాడింది. గాయత్రీ మంత్రము సాటిలేనిది. ఆ గాయత్రి ఉపాసన సూర్యారాధనయే. వాల్మీకి రామాయణములో అగస్త్యుడు రామచంద్రునికి సూర్యోపాసననే ఉపదేశించాడు. సూర్యుడు నవగ్రహ నాయకుడు కానీ ఈ శతకములో కవి ఎక్కడ సూర్యుని గ్రహముగా దర్శించలేదు. సూర్యుని ఆరాధించి మనకు కలిగే రుగ్మతలనుండి సమస్యలనుండి పరిష్కారం పొందవచ్చునని శాస్త్రములు చెపుతున్నాయి.

సూర్యాష్టోత్తర, శతనామ స్తోత్రం అకారాది క్షకారాంతమైనట్టిది. సూర్యుడు త్రిమూర్త్యాత్మకుడు. సృష్టి, స్థితి లయకారుడు. అందుకే విరించి నారాయణ శంకరాత్మునిగా సుర్యుని ఋషులభివర్ణించారు. సూర్య మంత్రోపాసన వైశిష్ట్యం మాటల చెప్పనలవి కాదని సాధకుల అనుభవం.

సూర్య నమస్కారములు ఆరోగ్యాన్ని ప్రసాదిస్తాయి. వైదిక కార్యకలాపాలలో సూర్య నమస్కారములు విశేషమైనది. 'నమస్కారః ప్రియోభానుః' అన్నది లోకంలో నానుడిగా స్థిరపడింది. 'ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్' అన్న సత్యము అందరెరిగినదే. సూర్యుని ఆరాధించి సత్రాజిత్తు శమంతకమణిని పొందిన వృత్తాంతం భాగవతములో కనబడుతున్నది. మాఘమాసంలో సూర్యనారాయణ స్వామిని ప్రతి ఆదివారం పూజించి పొంగలి నైవేద్యం పెడుతారు. ఆంధ్రదేశంలో అరసవెల్లి సుర్యనారాయణుని పుణ్యక్షేత్రం.

మయూరుడు సంస్కృతంలో సూర్య శతకము రచించారు. బ్రహ్మశ్రీ నారుమంచి వేంకట అనంత కృష్ణగారు రచించిన ఈ 'అనంత భాస్కర' శతకము ఆ కోవకు చెందినదే. 'భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద! దివసకర వరేణ్యా సవితా తిగ్మకిరణ' మకుటముగా సీస పద్యాలలో వీరు ఈ శతకాన్ని రచించారు. వీరు ఇదివరకే లలితాదేవి, వరసిద్ధి వినాయకుని తమ కవితా కుసుమాలతో అర్చించారు. అనంతకృష్ణ గారు మంచి ఆధ్యాత్మిక సంపన్నులు. శ్రీ మాత ఉపాసకులు. మంచి నిష్ఠాగరిష్టులు.

న్యాయవాదిగా ఉన్న శ్రీ అనంతకృష్ణగారికి సౌజన్యం, సౌమ్యత సహజలక్షణాలు.

శ్రీ అనంతకృష్ణగారు ఈ శతకములో సూర్యనారాయణుని తత్త్వాన్ని, సూర్యారాధనా ఫలములను, సూర్య వైభవాన్ని, సమగ్రంగా ఆవిష్కరించారు. సూర్యునికి సంబంధించిన అనేక రహస్యాలను కవితాత్మకంగా వెల్లడించారు. ఈ శతకమునందు "నీ లీల విభవాన నింగి చేరిన నీరు" (56వ పద్యం) అని ఇంద్ర ధనస్సును వర్ణించిన పద్యం భావ కవితా చాయలతో నాకు అత్యంత ప్రియమైనదిగా మారినది. 'ధీయో యోనః ప్రచోదయాత్' అన్నట్లుగా వారి ధిషణ సూర్యమార్గములో ప్రయాణించడం ఒక మహోన్నత ఆధ్యాత్మిక విశేషం.

సూర్యుడు సకల లోకాలకు చైతన్య ప్రదాత. సకల జీవకోటికి ప్రాణ ప్రదాత. సూర్యుడు లేనిచో అంతటా అంధకారమేనని అంతా వినాశనమేనని కాలచక్రము యొక్క గతికి సూర్యుడే మూలాధారమని కవి వర్ణించారు. "నియమాల పనిలేదు నిగమాల విధి లేదు జాతి వర్ణములేదు రీతి లేదు" (3వ పద్యం) అంటూ భక్త సులభుడు సూర్యుడని పేర్కొన్నారు. జీవునికి సూర్యునికి అభేదం. అందరి లోపలి ప్రాణ సూర్యునిగా వెలిగే జ్యోతి. అందరిలో ఉన్న ఉష్ణము సూర్యుడే. సూర్యుడు కమలబాంధవుడు. షట్చక్రాలు సూర్యుడందించే ప్రాణ శక్తి వల్లనే వికసిస్తాయి. సూర్యుని ప్రధాన మంత్రమునొకదానిని కవి నేర్పుగా 6వ పద్యములో అమర్చారు. అలాగే హంస గాయత్రి మంత్రార్థాన్ని 10వ పద్యములో నిక్షేపించారు.

ఉపనిషత్తత్త్వాన్ని,, పాంచభౌతికమైన జీవుల తత్త్వాన్ని 12వ పద్యంలో ఆవిష్కరించారు. 13వ పద్యంలో కుంతి సూర్యారాధన కథను, 14వ పద్యములో రాముడి ఆదిత్యోపాసనా గాథని వివరించారు. కందగర్భ సీస పద్యాన్ని రచించి తమ చిత్రకవిత్వ రచనా పాటవాన్ని ఛందస్సుమీద గల అధికారాన్ని చూపించారు. మరెన్నో వేద పురాణ శాస్త్ర రహస్యాలను తమ పద్యాలలో ఆవిష్కరించారు. వాలఖిల్యుల జన్మ వృత్తాంతాన్ని (16వ పద్యం), సూర్య రథగమన వైభవాన్ని (20వ పద్యం) కళ్ళకు కట్టినట్లు చూపారు. 23వ పద్యంలో చమత్కార భరితముగా 'దినకర' శబ్దాన్ని పద్యములోని ప్రతిపాదములో హృద్యముగా పొదిగి తమ ప్రతిభకు దర్పణం పట్టారు కవి. ఈ విధముగా ప్రతిపద్యములో ఏదో ఒక విశేష ప్రతిభ ప్రకాశిస్తుంది.

కవి సూర్యుని పంచపూజలతో 41వ పద్యంలో ఆరాధించారు. సత్సంగ ఫలితమైన శ్రీ గంధాన్ని విషయవాంఛలను కోసి విరులుగా, బహుజన్మ సంచితవాసనలను ధూపంగా చిఛక్తి దీపంగా కోరికలను ఆరగింపు చేసిన పంచపూజలను సమర్పించి నిండైన వైరాగ్యముతో ప్రభాకరుని ప్రస్తుతించారు. సూర్యునకు గల భాస్కరుడు,, మార్తాండుడు, హంస ఇత్యాది నామాలలో గల అంతరార్థాన్ని రమ్యంగా వివరించారు. మేఘమాలికలు రూపొందడానికి, జలనిధిలో జలాలు కలవడానికి సూర్యుడే మూలకారణమని, ఆ విధముగా లోకాలను పోషిస్తున్నది సూర్యభగవానుడేనన్న పరమసత్యాన్ని రమణీయంగా వివరించారు. గురు శుశ్రూషలో ఛాత్రవృత్తిలో జీవించి గురుకుల క్లిష్టముగా విద్యాభ్యాసం చేయవలసిన విధానాన్ని, త్వక్, చక్షు, శ్రోత్ర, జిహ్వాఘ్రాణాలన్ని పంచ జ్ఞానేంద్రియాలలో పరమాత్మ తత్వాన్ని పొందవలసిన విధానాన్ని శకలం నుండి సకలం వరకు నిండిన సూర్య భగవానుని సర్వవ్యాపకత్వాన్ని ఉండుట, పుట్టుట, జీవించుట, పెరుగుట, క్షీణించుట, లయమొందుట అనే జీవ వృత్తాన్ని, ఇవేవీ లేని సచ్చిదానందమూర్తి సూర్యభగవానుడన్న సత్యాన్ని అంతటా తనై నిండినవాడికి ఆసనమేమిటను సత్యాన్ని ఆవిష్కరిస్తూ ఆ స్థితి అనుభవించుటకు గల అర్హతలను కూడా సూచించారు. పుట్టినప్పటినుండి గిట్టువరకు గూడ ఎవరో ఒకరిని పట్టుకొనది బ్రతుకు వెళ్ళదనీ, పట్టుకోవలసిన భగవంతుని చేయి పట్టుకొన్నప్పుడే ముక్తి లభిస్తుందన్న జీవన సత్యాన్ని కవి కమనీయంగా ఆవిష్కరించారు. చంద్ర, కుజ, బుధ, గురు, శుక్ర, శని, రాహుకేతువులు గ్రహగతులు దాటి గ్రహరాజైన సూర్యభగవానుని తెలుసుకొనుటే అచ్చంపు తెలివి యన్న సత్యాన్ని కూడా కవి శబ్ద చమత్కారముతో ప్రదర్శించారు. అలాగే ఈ గ్రహములకు సూర్యుడేవిధముగా సౌషుమ్నాది కిరణ ప్రసారము ద్వారా ఉద్దీపింపచేయు రహస్యములను ప్రకాశింపచేసారు.

సూర్యుని నిత్యం వెన్నంటి వుండే సుదతులు పద్మినీ, ఉషా సంజ్ఞా ఛాయలను వారి తత్వాన్ని భక్తితో స్మరించారు. ప్రథమాది విభక్తులను ఉపయోగించి చెప్పిన పద్యంలో అవిభక్త భక్తినిమ్మని ప్రార్థించి ఒక పద్యములోనే సార్వవిభక్తికంగా సభక్తికంగా 85వ పద్యములో హృద్యంగా వర్ణించారు. ఈ లోకములో ఉండే సాంసారిక బంధాలన్నీ అశాశ్వతాలు, అసత్యాలు అసహజాలన్న సత్యాన్ని కవి 90వ పద్యంలో కళ్ళకు కట్టినట్లుగా చూపించారు. కులాలు మతాలు పరిధులను దాటి నామరూపాల రంగుల నటన దాటి శుద్ధచైతన్య తేజము చూపమని ప్రార్థించారు. 93,95వ పద్యాలలో జీవ తత్వాన్ని పరబ్రహ్మతత్వాన్ని విప్పి చెప్పారు.

99వ పద్యములో 'అనంత కృష్ణ భాస్కర శతకము' అన్న శతకనామాన్ని రథబంధంలోని పద్యం చాలా చక్కగ పొదగి ఆ ప్రభాకరుని 'నతులు గొని సమ్మతిని జూపు'మని ప్రార్థించారు.

ఈ భాస్కర శతకము శ్రీ అనంతకృష్ణగారి తాత్త్విక చింతనా వైభవానికి, పద్యరచనా పాటవానికి శబ్దార్థ ప్రయోగ చమత్కారానికి అన్నింటికంటే ముఖ్యముగా వారి సూర్యారాధన విజ్ఞానానికి దర్పణం పట్టినది. ఈ భక్తి కుసుమం సూర్యనారాయణునికి వారు భక్తితో చేసిన సమర్పణం. రసాలంకార ధ్వని, శబ్ద చమత్కారములు రసజ్ఞలోకము ఆనందింతురు గాక.

ఇంత గొప్ప కవి నా సోదరులని చెప్పుకోవడానికి గర్విస్తున్నాను. అనంత కిరణుడైన భాస్కరుడు శ్రీ అనంతకృష్ణగారి ధీవైభవాన్ని నిత్యం కాంతిమయం చేయాలని ఆకాంక్షిస్తూ...

**డా॥ పి. రాజ్యలక్ష్మి**<br>
స్కూల్ అసిస్టెంట్ ( తెలుగు),<br>
ప్రభుత్వోన్నత పాఠశాల,<br>
సుభాష్ నగర్, ఇల్లెందు ఖమ్మం జిల్లా

# చతుస్సాగర పర్యంతం॥

నిరాకార బ్రహ్మమును సాకారముగా దర్శించినప్పుడు అనేక రూపములు నామములు వచ్చి చేరుతాయి. మూల శక్తియందు మార్పు ఉండదు. నేను ఆ చిచ్ఛక్తిని సూర్యనారాయణమూర్తిగా నామకరణం చేసుకుని ఈ పద్యార్చన చేయు ప్రయత్నము చేసినాను. అందులో భాగముగా అపౌరుషేయాలగు వేదములు, నా యోగ్యతానుసారముగా లభ్యమైన సూర్య సంబంధ సాధికార సాహిత్యము, ఉపనిషత్తులు, స్తోత్రాలు, మంత్రాలు ఇలా నాకు లభ్యమైన వస్తువులను వినియోగించుకున్నాను. మరి భావాలు నా సొంతమనగలనా? పూలనేరుకుని గుచ్చానంతే. ఈ భాండాగారాన్ని అందించిన పరమాత్మ స్వరూపులందరికి పాదాభివందనములు. నేను లోగడ 'లలిత పదముల మది లలిత గొలుతు' అని అమ్మరూపములో ఆ చిచ్ఛక్తిని సేవించుకున్న భాగ్యమనుభవించినప్పుడు మా గురువుగారు ఆశీఃపూర్వకముగా ముందుమాట వ్రాస్తూ 'మా శిష్యునికి శతాయువులొసంగి నిత్యోన్నత స్థితిని కల్గించమని' అమ్మకి చెప్పారు. ఆ ఆశీర్బలమే ఈ పుస్తకం. వారనుగ్రహించిన అప్పటి పల్కులే ఇందులోని 'మంత్రమూలం గురోర్వాక్యం'. నమో మహద్భ్యః గురుభ్యః 'చిత్రకవితా సమ్రాట్' బ్రహ్మశ్రీ చింతా రామకృష్ణారావుగారు చిత్రకవిత్వంలో సిద్ధహస్తులని అంతర్జాలంలో చూసి పరిచయం చేసుకుని వారికి ఫోను చేస్తే రమ్మన్నారు. వెళ్ళాను. నాకు క్రొత్త వ్యక్తిని కలిసిన అనుభూతి అసలు కలుగలేదు. చాలా ఆత్మీయమైన వారింటికెళ్ళిన భావన. దాదాపు మూడు గంటలు గడిచాయట వారింట. నాకు ఒక క్షణమని అనిపించింది. ఎన్ని క్రొత్త విషయాలు చెప్పారో చెప్పలేను. వారు మాట్లాడినప్పుడు వారు స్పృశించని కవిత్వాంశం లేదంటే అతిశయోక్తి కాదు. వారిలోని గురులక్షణం 'విద్యార్థిని తనంతవాణ్ణి చేయాలనే లక్షణం' నేను మరువలేను.

'అవధాన రాజహంస, సహస్రావధాని' బ్రహ్మశ్రీ కోట వెంకట లక్ష్మీ నరసింహం గారిని ప్రథమంగా ఖమ్మంలో కలిసాను. తరువాత తరచు కలుస్తూనే ఉన్నాను. కలిసిన ప్రతిసారి వారిలోని విలక్షణ లక్షణం 'నాకేమీ తెలియదండీ' అనే అన్నీ వడ్డించిన నిండు విస్తరి లక్షణం నాలోని అహంకారాన్ని అదుపు చేసిందని చెప్పవచ్చు. పద్యం చదవాలంటే వారే చదవాలి. ఎంత కఠినమైన పద్యమైనా వారు చదివితే పిల్లవానికి కూడ అర్థమైపోతుంది. ఆ పదచ్ఛేదం, స్వర భేదం అంత అర్థవంతంగా వుంటుంది. మా గురువుగారి శతజయంత్యుత్సవములకి వారి రాక, సహాయము ఎంత గొప్పవో నేను వర్ణించలేను. వారి లోతు తెలుసుకోవటం భాగవతం లోతు తెలుసుకోవటంలాంటిది. ఇది అతిశయోక్తి కాదు. అంతటి భాగవతోత్తములు. వీరురిరువురు నాపై చూపెడి ఆదరాభిమానములు నాకు కల్గిన అర్హత వల్ల కాదు. వారి సహృదయతకి నిదర్శనం. కోరిన మరుక్షణం ఇరువురు కూడా వారి అమూల్యాభిప్రాయము వ్రాసి యిచ్చినారు. ఒకరు హైదరాబాదుకొక మూల మియాపూర్ లో వుంటే ఇంకొకరు తణుకు వాస్తవ్యులు. ఇదెందుకు చెపుతున్నానంటే, ఇంత దూరానున్నా నేనడిగినప్పుడు ఇద్దరి నోట వచ్చినది ఒకటే మాట ? 'అయ్యా ఇది మా

కార్యక్రమము కాదు–మాది. మీరు నిశ్చింతగా ఉండండి' అని. వారికి త్రికరణశుద్ధిగా నా నమస్సులు. నా ఆప్తమిత్రుడు శ్రీ కేశిరాజు వేంకట సత్య కామేశ్వరిగారికి కృతజ్ఞతలెలా తెలుపాలో నాకు తెలియదు. ఈ శతకం ప్రారంభించానని చెప్పినప్పుడు వారన్నారు ' ఇది మీరు వ్రాస్తున్న మూడో శతకం. పద్యం వ్రాసేటప్పుడు ఇది గుర్తు పెట్టుకోండి. పాకం తగ్గకూడదు'. ఈ మాటలు నేను కాగితం కలం పట్టిన ప్రతిక్షణం గుర్తుకొచ్చేవి. ఒక శ్రేయోభిలాషి తప్ప ఇంకెవరిలా అనగలరు? ప్రతి పద్యం పూర్తికాగానే వినిపించి నేననేవాణ్ణి 'ఉంచనా ? త్రుంచనా?' అని. తనదైన శైలిలొ నొప్పింపని విధంగా విమర్శించి విశ్లేషించి నాకు తగు సూచనలిచ్చేవారు. వారంతట వారే అన్నారు 'ఈ పద్యాలకి తాత్పర్యంతో అచ్చేయాలి' అని. అనటమే కాదు తనే ఆ బాధ్యత తీసుకుని చక్కని తాత్పర్యం వాసినారు. వారికి అభినందనలు.

అమ్మ ఇచ్చిన సోదరి డా॥ రాజ్యలక్ష్మి. విశ్వనాథవారి రామయణ కల్పవృక్షము పై పరిశోధన చేసారు. వారి దంపతులకి 'అన్నగారు బావగారు' తప్ప వేరే సంబోధన తెలియదు. పేరుకే మేము వేరు వేరు కడుపుల పుట్టినాము. ఖచ్చితముగా ఏదోయొక గతజన్మములందు ఏక గర్భసంజాతులమైవుంటామని నా నమ్మిక. మా సోమశేఖర్ గారి పుణ్యమా అని ఎంతమంది సహృదయులని పరిచయంచేసారో. అమ్మా ఈ పద్యాలు చదివి ఎలా ఉన్నాయో చెప్పు అన్నాను. కొన్నాళ్ళ తరువాత 'అన్నయ్యగారు నేను ఈ పుస్తకాన్ని నిత్యం పారాయణ చేస్తున్నాను. మా స్కూలు పిల్లలకి కొన్ని పద్యాలు నేర్పిస్తున్నాను' అన్నారు. ఇంకా నా జన్మ ధన్యం కాలేదనగలరా? నాకు తోచినవి నాలుగు మాటలు వ్రాయవచ్చా అని అడిగి వ్రాసినదే 'అనంత భాస్కర రశ్మి'. అదొక అనుభవైక్య వేద్యమైన అనుభూతి.
ఇంట్లో ఏపని పట్టిచ్చుకోకుండా నా పుస్తకాలు వ్రాతలు అంటూ ఉన్నా పాపం అన్ని పనులు తనే చూసుకునే నా ధర్మపత్ని వనజ షట్కర్మయుక్త. మాది అర్థనారీశ్వర బంధం.

'సాయిగారూ మీకు మధుకి మళ్ళీ పని పెడుతున్నాను' అనగానే రండిసార్ చేసేద్దామని అనటమేకాదు ఇంత అందముగా ఈ పుస్తక రూపాన్ని ఆవిష్కరించిన మా శ్రీ పర్ఫెక్ట్ గ్రాఫిక్స్ సాయిగారికి వారి రెండుభుజములైన శ్రీ మధు గారికి ప్రత్యేక ధన్యవాదములు.

ఇందులో గణ దోషాలు, గుణదోషాలు ఇలా అనేక రకాల దోషాలుండి వుంటాయి. అవన్నీ కూడా సహృదయంతో మన్నించి ఆదరించిన మీ అందరికి మనఃపూర్వక వందనములు.

మీ

**నారుమంచి వేంకట అనంత కృష్ణ**

# శ్రీ అనంత భాస్కర శతకం

శ్రీ భాను ధ్యానమ్ము చేకూర్చు క్షేమమ్ము
నారోగ్య మైశ్వర్య మమిత శక్తి
ఆదిత్య కిరణమ్ము హరియించు తిమిరమ్ము
సకలార్ధములనిచ్చు సాధకులకు
సప్తాశ్వ నీ మంత్ర సంధానమును జేయ
హృదయంబునానంద సదనమగును
పరమ పావన నీదు పాదముల్ మది గొల్చి
నీవె దిక్కందును నిత్య సత్య

పద్మ బంధు భక్త జన హృత్పద్మ వాస
స్తుతులు నతులు జేతు ననంత మతుల గతుల
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 1

శ్రీ సూర్యనారాయణుని ధ్యానము క్షేమమును, ఆరోగ్యమును, ఐశ్వర్యమును అమిత శక్తిని కలిగిస్తుంది. ఆదిత్యుని తేజస్సు అజ్ఞానములను చీకట్లను తొలగించి, సాధకులకు చతుర్విధ పురుషార్ధములనిచ్చును. భాస్కరుని మంత్రానుష్ఠానము చేసిన హృదయము ఆనందమును అనుభవించును. ఓ దేవా నీవే దిక్కని నీ పాదములను నమ్మినాను. భక్తజనుల హృదయ కమలములందు నివసించు కమలబాంధవా నిన్ను అనంత రీతులతో సద్బుద్ధితో స్తుతించుచున్నాను.

**భూత జాలములన్ని పుట్టె నీ నుండియే**
**వేద రాశివి నీవె వేత్త వీవె**
**వాగాది, శబ్దాది, ప్రాణాది, చర్మాది,**
**పంచ పంచికలన్ని పరగ నీవె**
**పుట్టించి, పోషించి, గిట్టించు వైనాన**
**కాల చక్ర గతికి కర్త వీవె**
**అరిసంఘ విధ్వంస, పరిపాలనాదక్ష**
**ప్రత్యక్ష పరమాత్మ ప్రభువు నీవె**

**మూడు మూర్తులు నీవైన మూల పురుష**
**నిజము నెఱుగంగ మనసార నిన్ను గొల్తు**
**భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద**
**దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ** **2**

ఓ సూర్యదేవా! ప్రాణులన్నియు నీ శక్తివలన పుట్టినవి. వేద శాస్త్రము వేద జ్ఞానము నీవే. ఈ దేహ నిర్మాణము దానిలోని త్వగాది మూలకాలు అన్ని కూడా నీవే. సమస్త జీవజాల సృష్టి స్థితి లయాత్మకమైన కాల చక్రగతి కారకుడవు. చరాచర జగత్తును నిర్వహించువాడవు. ప్రత్యక్షముగా కనబడు దేవుడవు. బ్రహ్మ విష్ణు మహేశ్వరరూపములకు మూలపురుషుడవైన నిన్ను, ఆత్మ తత్త్వ సోధనకై, మనసార భక్తితో కొలతును.

విశేషాంశము: శ్రీ సూర్య అధర్వ శీర్షోపనిషత్ సారంశమే ఈ పద్యము.

నియమాల పనిలేదు నిగమాల విధి లేదు
జాతి వర్ణము లేదు, రీతి లేదు
సంభారములు లేవు సంకోచములు లేవు
భూరి దక్షిణ లేదు, పూజ లేదు
మడిగట్ట పని లేదు, మంత్రాల పని లేదు
వయసుతో పని లేదు, భయము లేదు
వెదుకనక్కర లేదు వెతలోర్చి నిన్ గూర్చి
కొండ కోనల వెంట, గుడుల వెంట

శిరము పైకెత్తి నినుగాంచి కరము మోడ్వ
వర పరంపరనిచ్చు నా స్వామి వీవు
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 3

ఓ భాస్కరా! నీ వరములు పొందుటకు పూజా సామగ్రి సమకుర్చుకొనుపనిలేదు. దేవుడున్నాడా లేడా అను అనుమానమక్కరలేదు. పూజచేయుటగాని, దక్షిణలిచ్చుటగాని, మడి కట్టుట గానీ, మంత్రాలు వల్లెవేయుటగానీ అవుసరము లేదు. వయసుగానీ మానసిక భయము గానీ అడ్డురావు. ఎన్నో కష్టాలు పడుచూ కొండలలో అడవులలో గుడులలో నీకొఱకు వెదుకనక్కరలేదు. ఆత్మయందు విశ్వాసముతో తలపైకెత్తి భక్తితో చేతులెత్తి నమస్కరించిన చాలును. ఇహలోక సంబంధమైన అశౌచములు లోక వ్యవహారములు నిన్ను చేరుటకు అడ్డు రావు. నీవు అత్యంత భక్త సులభుడవని భావము.

నీ రశ్మి జాలాల సారించి ప్రేమగా
నక్కునన్గొనగ నీయందు నేను
పరమాత్మ నాలోన భద్రమై వసియింప
నీవు నా యందన్న నిజమె యౌను
ఎవ్వరెవ్వరి యందొ యెఱుక లేకుండుట
వేరు వేరుగ చూచు తీరు తప్పు
నీవు నేనొకటన్న నిశ్చయమ్మునుపొంది
అద్వైత యోగాన నార్తి దీర

మాయ రాగాది దోషాళి, మాయ తొలగి
ఎంత సుఖమయ్య యీ రీతి ఎఱుక గలుగ
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 4

ఓ భాస్కరా! నీ కిరణమ్ముల ప్రసరింపజేసి నన్ను నీవు దరిచేర్చుకున్నచొ నీలో నేను, నాలో నీవు భద్రముగా వసించెదము. ఆత్మకు పరమాత్మకు అభేదమని గ్రహించక పోవుట అజ్ఞానము. ఆత్మ పరమాత్మ ఒకటే అను జ్ఞానమును పొంది జగన్మాయను అనురాగ బంధములను తొలగించుకుని నీపై రక్తి కలిగి యుండుట సౌఖ్యములను కలుగజేయును. తండ్రీ అట్టి జ్ఞానమును కలుగజేయుము.

కమలాలు నినుగాంచి కనువిచ్చునో లేక
నీ చూపు బలిమియో నీకె తెలుసు
పంకస్థ దోషమ్ము పాటిసేయక వాని
నుద్ధరింతువు గదా శుద్ధ తత్త్వ
కారణమ్మేదైన కమలాప్తుడవు నీవు
కమల నీయకుమొక్క కమలమైన
బహు వర్ణముల తోడ, బహుపత్ర కమలాల
నారు దండను గట్టి యరగు చుంటి

చూడుమవ్వాని, పరిపూర్ణ శోభ వెలయ
మరల వాడగలవు, దృష్టి మరల నీకు
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 5

ఓ భక్త వరదా! కమలములు నిన్ను చూసి మేల్కొనునో, నీ చూపు బలము వలన అవి విప్పారునో తెలియదు. బురదనుండి పుట్టినను ఆ దోషము తగులనీయకుండా వాటిని పవిత్రముగా చేసి ఉద్ధరిస్తున్నావు. కమలబంధుడవు కావున నీవు మూలాధారము నుండి సహస్రార కమలములు కల నాపై కరుణించి జ్ఞానము కలుగజేసి వికసింపజేయుము. నీ దృష్టి లేకున్న అవి వాడిపోవగలవు. ఓ దేవా సదా నీ దృష్టి నాపై నుంచి కరుణించు.

**పిలువ ఘృణివటంచు భీతిల్లు తరుణాన**
**శిరము పై కరముంచి శివము గూర్చు**
**కొలువ సూర్య పదమ్ము కూర్మి గావుమటంచు**
**తుదకంట సరిజేయు నుదిటి వ్రాత**
**తలువ నాదిత్య తా దరిజేరి ప్రణమిల్లి**
**కాపాడు తన దీప్తి కనులు నిండ**
**విలువ యోంకారమో వివరింప పనిలేదు**
**సర్వ సంపదలిచ్చు సౌఖ్య మిచ్చు**

**చీడలన్నిటి మొదలంట చిదిమి వైచి**
**మూల శక్తిని నాకిమ్ము ముక్తి పొంద**
**భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద**
**దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ** **6**

ఓ ఘృణీ శరణు అని వేడినచో తలపై నీ కిరణములను కరములనుంచి ఇహలోక భయాలను తొలగించి శుభములు కలుగజేస్తావు. తలవ్రాతను ఆమూలాగ్రము సరిచేయుదువు. నిన్ను నమస్కరించిన మాత్రమున సకల సంపదలను శక్తినిచ్చి శరీరమునకు ఆత్మకు పట్టిన మలినములను తొలగించి నమస్కరించిన తన ప్రకాశములతో కాపాడును. తండ్రీ కరుణతో నీ మంత్రానుష్టానము ద్వారా ముక్తినొసంగుము.

విశేషాంశము: పిలువ, కొలువ ఇత్యాది "మొదలంట చిదిమి వైచి" చూస్తే "మూల శక్తి" కనపడుతుంది

అరయ నీవేనయ్య ఆదిదైవతమన్న
ఇల మమ్ము బ్రోచు నీ యీక్షణమ్ము
ఉష తోడ ఛాయ తో ఊరేగు నా వాడ
ఋజు వర్తనము నిచ్చి బుద్ధి నిచ్చి
ఏకస్థ చిత్తమ్ము ఐకమత్యమునిచ్చి
ఓ రేడ నిల్చెద ఔర! యనగ
అంశుమాలికి సేవ లహరహవృద్ధిగా
హృద్బిందు సంయోగ హేల గనగ

దారి నడిపించు నా చేత జార గలను
వదల నీయకు నీవును వదలఁబోకు
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 7

ఓ సూర్యదేవా! లోకమందు ఆదిదేవుడవై మమ్ము కాపాడుము. ఉషా, ఛాయ అను ఇద్దరు భార్యలతో కలసి లోకమును రక్షించు ఓ దేవా ఋజు ప్రవర్తన ఆధ్యాత్మికాభివృద్ధి కోరి నిన్ను సేవించుచున్నాను. ఐహిక విషయములను వదలి ఏకాగ్ర చిత్తముతో సహనముతో సాధన చేయుట సకల రోగములకు ఔషదము. అట్టి మంత్రానుష్టానము చేకూర్చి నిన్ను సేవించు బుద్ధినిమ్ము. సాధన నుండి నా మనసు జారకుండా సన్మార్గము చూపించుము.

**భక్త చిత్త సరోజ భాగ్యంపు భృంగమై**
**శర్మము గూర్చెడి ధర్మ మూర్తి**
**తననంతుడైయ్యుండి వన జనులను గూడె**
**సచ్ఛీల సాకార చక్రవర్తి**
**కౌశిక మునివరు కారుణ్య ఫల రూప**
**శస్త్రాస్త్ర శృతి లబ్ధ సత్య కీర్తి**
**పతికై, యపర్ణాన్న వ్రతమున్న, సీత, హృ**
**త్తోసముడు, శ్రీ రఘు రామ మూర్తి**

**వంశ కర్తవై, నఘ హర్త వైచెలంగి**
**భర్తవై, తాప హర్తవై భయము దీర్పు**
**భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద**
**దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ** **8**

ఓ సూర్య భగవానుడా! భక్తుల హృదయమను కమలమందు తేనెటీగ వలె చేరి సకల శుభములను కలుగజేయు ధర్మమూర్తియైన రాముడు పితృవాక్య పరిపాలన కొరకు  సచ్ఛీలముతో అరణ్యములను చేరి లోక కళ్యాణమొనరించెను. విశ్వామిత్రుని కరుణతో శస్త్రాస్త్రములను వేద జ్ఞానమును పొంది సీతాదేవి హృదయమునకు చల్లని కాంతినిచ్చిన శ్రీ రఘురాముని వంశ కర్తవు పాప హర్తవు ఇహలోక తాపములను భయములను తీర్చువాడవు.  నా పాపపుణ్యములను భరించి నన్ను కాపాడుము

కష్టముల్గలుగంగ నిష్ట దైవము గూర్చి
జప హోమములయందు తపములందు
భక్తితో కైమోడ్చి భగవాను దరి జేరి
వేడుకొందురు దయ జూడుమనుచు
అద్దేవతా నేత్ర మరయంగ నీవండ్రు
రూపమ్ము లేవైన చూపు నీదె
గమనించు నా తండ్రి గతి వీవె యందురే
మనసు పెట్టియు గాని మరచి గాని

కావ మమ్ముల నిదిచాలు కారణమ్ము
పాహి శరణంచు వదలనీ పాదములను
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 9

ఓ దినకరా! కష్టములను తొలగించుకొనుటకు ఇష్టదైవమునకు జపములు తపములు హోమములు చేసి కరుణించమని వేడుకొందురు. అట్టి దేవతలకు నీవే నేత్రమై వుందువు. రూపములు వేరైనను దయ చూచు చూపు నీవే. ఓ తండ్రీ! నేను మనసు పెట్టి వేడినను, లేకున్నను రక్షించువాడవు నీవె. నీవే శరణని నీపాదములపై మనసు లగ్నము చేసి వేడుకొనుచున్న ఈ దీనుని కరుణించుము.

హంస యనగ జెల్లు నవ్యయ మచించ్య
మద్వయ సత్యమౌ నాద్య శక్తి
హంస యనగ జెల్లు నా శక్తి తెలియంగ
మననమ్ము జేసెడి మంత్రమునకు
హంస యనగ జెల్లు నన్నింట భాసిల్లు
ఖండ రూపమ్మున నుండు జీవి
తెలియ వలసినది, తెలియ జేయునదియు
తెలివితో తెలియంగ తలుచు వాని

తెలియ నొక్క పేరది యేల తెలుపు మయ్య
అదియు నద్వైత బోధయా హంస నామ
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 10

సః అహం అనగ అతడే నేను.ఆ పరమాత్మయే నేను అని అర్థము. దాని వ్యత్యయ రూపమే హంస. హంస యనగా బ్రహ్మజ్ఞానము, మార్పు లేనిది ఖండింపరానిది నిత్య సత్యము మూల శక్తి. హంస యనగా మంత్ర శక్తి. చరాచర ప్రపంచములో అన్నిటా ప్రకాశించు సూక్ష్మ రూపము. పరమాత్మ స్వరూపము. తెలుసుకోవలసిన మూల తత్త్వము, దానికుపయుక్తమైన మంత్రము, దాని సాధన చేయు సాధకుడు 'హంస' సంజ్ఞతో పిలువ బడుటయే అద్వైత బోధన. అట్టి జ్ఞానమును కలుగజేయుము.

ఏమి లేకుండనే యింతింత పోగేసి

ఎండ వానలయందు నెదిగి యొదిగి

మట్టినంతయు బాగ గట్టి పడగ జేసి

శిలలాగ ననుమార్చి శిల్పివి నీవౌచు

కాలు సేతులనిచ్చి కళ్ళ నిచ్చి

కోతిలాగున జేసి కోరినట్లాడించ

అసలైన సంగతి మసక బారె

నిజము తెలియక శిల్పమ్ము నేనెయంటి

రభస చాలించు నీ పాద రజము నేను

భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద

దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 11

ఓ భక్తవరదా! శూన్యములో ఉన్న ఇంతింత పదార్ధములను పోగుచేసి ఎండా వానలలో వానిని వృద్ధి పరచి ఈ శరీరము అను మట్టిని గట్టిపడునట్లుగా చేసి నాపై జాలి చూపించక నన్ను జడపదార్ధముగ మార్చిన శిల్పివి నీవు. కాళ్ళు చేతులు కళ్ళూ చేకూర్చి చంచల స్వభావము కల కోతివలె నన్ను మార్చి ఆడించుచున్నావు. పరమార్ధము తెలియక మనసులో మసక బారి నిజము మరచి 'నేను' అను భావముతో విర్రవీగుచున్నాను. ఓ దేవా! నేను నీనుండి వచ్చిన పరమాణు స్వరూపమును. ఈ జీవన్నాటకమును చాలించి నన్ను కాచుము.

భిన్న ఘటములందు భిన్న పటములందు
ఆకాశమంతట నసలు నొకటె
పాత్రలు వేరైన మాత్రాన చూడగా
జగమంత నిండిన జలమదొకటె
దేహాలు, రూపాలు, దేశాలు, జీవాలు
పుట్ట జేసినయట్టి మట్టి యొకటె
అగ్ని తేజమొకటె యన్నిట, చూడగా
నాయువై చెలగేటి వాయువొకటె

ఛద్మమై బహు గతుల చిచ్ఛక్తి యొకటె
కల్ల నొల్లక సత్యము కనగ నొకటె
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 12

ఓ ఆదిత్యా! అనేక రకాల ఘటములలో వస్త్రములలో వ్యాపించిన శక్తి ఒకటే. పాత్రలు వేరైనను అందుగల నీరు ఒకటే. అనేక రూపములు ప్రాంతములు జీవులు వీటియందుగల మట్టిఒక్కటె. చరాచరములలో గల అగ్ని ప్రకాశమొకటె. ప్రాణముగా జీవులలోగల గాలి ఒకటె. వేరు వేరుగా ఉన్నను ప్రపంచమంతటా వ్యాపించిన శక్తి ఒకటే. మాయను వదిలించి సత్యము చూసినచో ప్రపంచమంతయూ ఆకాశము, వాయువు, అగ్ని, నీరు, మట్టి అను పంచభూతముల సముదాయము.

**కుంతి కుమారి తాఁ గొల్చెను నమ్మక**
**పాండు రాజ సుతుడు, భయము దీర**
**గీత దాటిన జానకీమాత కై స్వామి**
**వేద వేద్యులు మూడు వేళలందు**
**ఋషి భరద్వాజ ప్రభృతులును కొల్చిరే**
**మంత్ర జపము జేసి, మదిని తలచి**
**స్తోత్రాల స్తుతియించి, తోయమ్ము చేజార్చి**
**యజ్ఞ యాగాదుల నాచరించి**

**ఎందు కొఱకైన, యెట్లైన, యెవరి నైన**
**చర్చ జేయక స్వాంతన గూర్చువాడ**
**భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద**
**దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ** **13**

ఓ భక్తవరదా! వరప్రసాదమువలన లభించిన మంత్ర శక్తిని పరీక్షింప దలచి జపము చేసినంత మాత్రాన కుంతీదేవిని కనికరించావు. అవసరార్ధము ధర్మరాజు తలచినంత మాత్రాన అక్షయ పాత్రనిచ్చి కాపాడినావు. రావణ సంహరించి సీతా మాతను పొందుటకు రాముడు నిన్ను స్తుతించినంతనే శక్తినిచ్చినావు. వేద పండితులు త్రిసంధ్యలలో అర్ఘ్యములనిచ్చినంత మాత్రాన వారిననుగ్రహించుచున్నావు. భరద్వాజుడు వంటి నీకై యజ్ఞ యాగాదులను చేసి బ్రహ్మజ్ఞానమును పొందినారు. ఏవిధముగానైనను ఎవరైనను నిన్ను కొలచిన, వారికి స్వాంతన కలుగజేయుదువు. సదా నిన్ను స్మరించు నన్ను కరుణించు స్వామీ.

మాయను జిక్కుట మది నూహ జేయగా
రానిది తగులగ రాదనంచు
వారింప శక్యమే, వాక్కున పల్కుటె
టుల, నిశ్చల గతులన్ గలుగు టెటుల
దాయక తెల్పుము తదుపాసనా సుసా
ధ్యమ్మది చెందగ నెమ్మది గొన
నీ యనుకంపయౌ నిర్గుణ సత్యము
తృటినందెడి విధమున్ తెలియనెంతు

ఆటుపోటులఁ జిక్కక నటునిటులను
బారక గమనమాగని బాట జూపు
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 14

కం? మది నూహ జేయగారా నిది వాక్కున పల్కుటెటుల, నిశ్చల గతులన్
తదుపాసనా సుసాధ్యమ్మది నిర్గుణ సత్యము తృటినందెడి విధమున్
ఓ ఆదిత్యా! ఈ మాయలో చిక్కి ప్రపంచవిషయ వాంఛ కూడదని వారించుట శక్యమా? నా బాధను తెలుపలేక ఊహించలేక కొట్టుమిట్టాడుచున్నాను. ఈ బాధలను తొలగించు ఉపాయము దాయక తెలుపుము. నిర్గుణ సత్యము వెనువెంటనే పొందుటకు మరియు మనసు ఆటుపోటులను కష్టములను ఎదుర్కొని నిశ్చలముగా నిలబడు మార్గమును తెలియజేయుము స్వామి.
విశేషాంశము: ప్రతి పాదములో అటు ఇటు తొలగించి మధ్య గణములు తీసికొన్నకంద పద్యము వచ్చును. పదముల క్రింద గీత ఉన్న భాగము కందపద్యము.

ఉపకార మొనరించ నుపదేశ రూపాన
యుక్తమౌ విషయమ్ము వ్యక్త పరచ
నుద్భవించెదరంట యుద్ధరించుటకునై
సంచితమ్ముల నన్ని సమయ జేసి
స్థాయి భేదము బట్టి సాధనా సంపత్తి
సాధ్య పడగ జేయు సద్గురుండు
పొత్తమ్ములను గాక చిత్తమ్ములను బట్ట
సచ్చిదానందమౌ సరణి కలుగు

స్థితి గతుల నెఱుగ స్థిర చిత్తమెఱుగ
గురుతెరిగి నీవె కాపాడు గురుని భాతి
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 15

ఓ తిగ్మకిరణా! గురువులు ఉపదేశము ద్వారా అవసరమైన విషయములను తెలియజేసి జన్మజన్మలనుండి జీవుల వెన్నంటి వచ్చుచున్న పాప పుణ్యములనుండి ఉద్ధరించి ఉపకారము చేయుదురు. వ్యక్తికి గల సంస్కార స్థాయిని బట్టి సాధనా సంపద పొందుటకు సద్గురువు మార్గదర్శి కాగలడు. గ్రంథములను చదివి విషయ సంగ్రహణ చేయుటకన్నా మనసును అదుపులో నుంచుకొని సాధన చేసిన సచ్చిదానంద స్థితి కల్గును. ఓ దేవా! నాకు ఆ స్థితిగాని సాధన చేయు గతి గానీ తెలియదు. మనసును స్థిరముగా నిలుపలేను. నా యీ స్థితిని గ్రహించి నీవే గురువువై దారిచూపి కాపాడు.

ధాతకునేలనో రేత స్ఖలనమౌట
నద్దాని నగ్నిని యాజ్యమట్లు
హోమము సేయుట, హోమాగ్ని యందున
వేలకు వేలుగ వాలఖిల్యు
లు, కిరణ పాను లలుప్తాగ్ని తేజస్కు
లంగుష్ట మాత్రులు నస్ఖలితులు
బ్రహ్మచారులు పుట్టి బాయక నీ తోడ
దిరుగాడు వరమొంది ధన్యులైరి

వున్న తావున పరువెత్తుచున్న వాడ
నన్ను సైతము గమనించ విన్నవింతు
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 16

బ్రహ్మ రేతస్సు కారణముగా జన్మించిన వాలఖిల్యులు మొదలగువారు బ్రహ్మచర్య దీక్ష బూని నీ వరబలాన సదా నీ వెంట తిరుగుచూ శాశ్వతానందము పొంది ధన్యులైరి. నేను వారి వోలె తిరుగలేకున్నను మనసు నీవెంట పరుగులెత్తుచున్నది. నన్ను కూడా వారివోలె నీవెంట తిప్పుకొనుము.

నిన్ను మరచువేళ నిజమైన లేమియై
శోభిల్ల నీయందు స్ఫురణ ధనము
మనసన్న మోసము మాపాలి రోగమై
మానని నీ సేవ మాకు మందు
స్వార్థము భోగేచ్ఛ వాంఛాలసత్వముల్
క్రిందకు లాగుచు కృంగ జేయు
శ్రద్ధయు భక్తియు సాధు వర్తన దీక్ష
ఉత్తమ గతినొంద నుండ వలయు

నను బోధన సేయంగ నలసి పోను
అనువదించగ చేతల కనికరించు
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 17

ఓ భక్తవరదా! నిన్ను మరచుటయే పేదరికము. నీ సేవయే సంపద. విషయ వాంఛలలో తిరుగాడు మనసు కలిగియుండుట రోగము. నిరంతరము నీ సేవ చేయుట అద్భుత ఔషదము. స్వార్థము విలాసము కోరికలు పాలుమారుట అను గుణములు నన్ను సాధన నుండి బయటకు లాగివేయుచున్నవి. కావున శ్రద్ధా భక్తి సత్త్వవర్తన పట్టుదల అను ఉత్తమ గుణములను బోధించి సాధన చేయు మార్గమును చూపించుము

లక్ష్యమొకటెయైన లక్ష్యించు తరుణాన
తానున్న యాశ్రమ ధర్మ మెఱిగి
తన సాధనల జేయ తరియించగా వచ్చు
ధర్మ భంగంబైన తప్పిదమ్ము
మలి యాశ్రమంబున మరల మారగవలె
విధి నిషేధమ్ముల వివర మరసి
ఆశ్రమ మ్మేదైన నేశ్రమయును లేక
నామ స్మరణ జేయు నాల్క కలుగ

మార్గ మధ్యమ్ము నందున మార్పు లేక
చేరు నిశ్శ్రేయస పదము క్షేమముగను
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 18

ఓ భాస్కరా! బ్రహ్మచర్యము గార్హస్త్యము వానప్రస్థము సన్యాసము అను నాలుగు ఆశ్రమములు కలవు.ఏ ఆశ్రమమునందైనను ధర్మవర్తనతో మోక్షసాధనా అను లక్ష్యమును చేరవచ్చును. విధివిధానమును మలి ఆశ్రమమునందు మారవచ్చును కానీ ఏ ఆశ్రమమందైన ఏమార్పును లేక నామ స్మరణయందు మార్పులేదు. సదా చిత్తమందు నీ నామస్మరణ చేయువారికి ధ్యానించువారికి క్షేమముగా మోక్షము సులువుగా చేకూరును.

అస్థిర దేహమ్ము సుస్థిరమందును
సుస్థిరుడవు నిన్ను చూడనేల
స్వప్న తుల్య జగతి సత్యమందునదేల
నిత్య సత్యుడవైన నిన్ను వదలి
కర్మల చేయుచో కర్త నేనేయందు
నీవె కర్తవనెడి నిజము నెరిగి
సంచరింతువు నీవు సర్వ జీవులయందు
కొందర చూడగ గొడవ పడుదు

తెలిసి తప్పులు చేయుట తెలివి యౌనె
భ్రాంతి తొలగించి యసలైన కాంతి జూపు
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 19

ఓ భాస్కరా! ఈ దేహము నిత్యము కాదు. కానీ నిత్యమే అనుకొని ప్రాకులాడుచున్నాను. స్థిరముగానున్న నిన్ను చూడలేక పోవుచున్నాను. నిత్య సత్యమైన నిన్ను వదలి కలవంటి ఈ లోకమును సత్యముగా భావించుచున్నాను. చరాచర జగత్తులో అన్ని కార్యములకు నీవే కారణభూతుడవు. కానీ నేనే కర్తనని గర్వపడుచున్నాను . అన్ని జీవులలో నీవు పరమాత్మవై సంచరించుచున్నను కొందరితో తగవు పడుచున్నాను. తెలివిలేక తెలిసి కూడా తప్పులు చేయుచున్నాను. ఈ మోహమను భ్రమను తొలగించి జ్ఞానమను కాంతిని నాకు కలుగజేయుము తండ్రీ.

కమనీయమైనట్టి గంధర్వ గానమ్ము
లపురూప నృత్యాల నప్సరసలు
స్తోత్రాలు వేదాలు స్తుతియించి సాగంగ
ముందు వైపున ఋషి బృందమంత
రక్షోహుడాదిగా రాక్షసులందరు
వెన్నంటి నీయొక్క వెనుకనుండ
కళ్ళెమ్ము పట్టుక గ్రామణులు నడువ
తీరుగా సర్పాలు తేరు లాగ

బ్రహ్మ దత్తమౌ బంగరు రథము నెక్కి
తిరుగ దగుగాని నా బోంట్ల మరువ దగునె
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 20

ఓ సవితా! నీవు గంధర్వుల గానములు, అప్సరసల నృత్యాలు ఋషిపుంగవుల వేదమంత్ర స్తుతులు జరుగుచుండగా, రక్షోహుడు మొదలగు రాక్షసులు నీ వెనుక వచ్చుచుండగా సప్తాశ్వ రథమును గ్రామణులు కళ్ళెము పట్టిలాగుచుండగా సర్పములు బ్రహ్మ యిచ్చిన బంగారు రథము నడిపించుచుండగా లోక సంచారము చేయుచున్నావు. ఇన్ని భోగములను నీవు అనుభవించుచున్ననూ, నా వంటి పతితులను మరువక కాపాడుము.

అంతరింద్రియముల నదుపులో నుంచుచున్
బాహిరింద్రియముల పరుగులాపి
శబ్దాదులం దనాసక్తి పెరుగుచుండ
ద్వంద్వాదుల న్సమ దృష్టి గలిగి
గురుని వాక్యమ్మందు గురికల్గి చరియించి
నీయందు మనసును నిలిపి నిలిచి
అగ్ని జిక్కిన చీమ యారడి చందాన
ముక్తికై నాకాంక్ష మొక్క వోక

తత్త్వమస్యాది వాక్యార్థ తత్త్వమెఱిగి
శాశ్వతానంద సంప్రాప్తి సాధ్య పరుచు
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 21

ఓ దేవా! అంతరింద్రియములనదుపులో పెట్టుకుని బాహిరింద్రియముల పరుగులనాపి శబ్ద స్పర్శ రూప రస గంధాదులయందు ఆసక్తి తగ్గించుకుని సుఖ దుఃఖాదులపై సమభావము కలిగి గురువాక్యము పై గురి కలిగి నీ యందు మనసు కలిగి ధ్యానించు అవకాశమును కలుగజేయుము. నిప్పులో పడ్డ చీమ బయటపడుటకు ఆరాట పడునట్లు ఈ ప్రాపంచిక విషయములను ప్రళయాగ్ని నుండి బయట పడుట అను కోరికను బలహీన పరచక నీ అద్వైత తత్త్వమును తెలిసికొని శాశ్వతమైన పరమానందమును పొందు మార్గమును ప్రసాదించుము.

ఎవ్వని మండలమెన్నగా దారిద్ర్య
దుఃఖ క్షయకరమ్ము దోషహరము
త్రైగుణ్య రూపమ్ము త్రైలోక్య పూజ్యమ్ము
జ్ఞాన ప్రదీపమ్ము నాద యుతము
ధర్మ వృద్ధి కరమ్ము మర్మ ప్రబోధమ్ము
దేవాది పూజ్యమ్ము దీప్తికరము
వేదాది స్తూయమ్మనాది స్వరూపమ్ము
సర్వ పాప హరము సర్వగతము

అట్టి నాస్వామి నిన్నిటు పట్టుకొంటి
చేరగొని నన్నుపునీతుని జేయుమయ్య
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 22

ఓ సవితా! సూర్య మండల ధ్యాన దీక్ష చేపట్టి పూజించిన దారిద్ర్యము దుఃఖము పాపము హరించును. సత్వరజస్తమోగుణాత్మకమైన మండలవాసివి. అది ముల్లోక పూజితము, జ్ఞాన వృద్ధి చేయునది, నాద బ్రహ్మ, ఔపాసనా రహస్యములు తెలియజేయునది. స్వయంప్రకాశితము. వేదోపనిషత్తుల సృష్టికర్త పాప సంచయము రూపుమాపునది. అన్నిటికి ఆదిస్వరూపము. అట్టిప్రదేశమునకు అధిపతివైన ఓ స్వామీ! నేను నిన్ను ఆశ్రయించి శరణు వేడుచున్నాను. నన్ను చేరదీసి పవిత్రునిగా చేయుము.

అందిన కరమందుకొందనిన్ శిరమిడి
గురుపద సీమపై వరమడుగగ
పొందిన కరదీప చందమౌ సన్మంత్ర
రక్షణ నొందగా దీక్ష నిచ్చి
కన్నోట కుందిన కరవాల సదృశమౌ
దృగ్జాలముల చేత త్రెంచి వేసి
కాలుడు కీలల కాల్చగ జాలక
భయమొందిన కరణి పరుగు వెట్ట

కోరి రక్షించ దక్షులౌ గురువులకును
స్ఫూర్తి నిచ్చెడి సద్గురు మూర్తి వీవు
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 23

ఓ భక్తవరద! చేతికి చిక్కిన అవకాశము పొంది గురుపాదములపై తలవంచి వరమడుగగ వారు అందుబాటులోనున్న వెలుగు దివ్వెవలె ఉత్తమమైన మంత్ర దీక్షను నాకు రక్షణకై ఇచ్చి ఖడ్గమువలెనున్న చూపులతో మోహమును తెంపి ప్రళయకాల అగ్నినుండి రక్షణ కొరకు భయముతో పరుగుపెట్టగా రక్షింప సమర్థులు గురువులు. అట్టి గురువులకే ఆదిగురువైన నీవు నన్ను రక్షించి కాపాడుము.

ఉంచగనెంతువా ఉంచెదవంతియే
కాదేని యుంచవు క్షణమె యైన
నీయందు నుండగ నీ నామ స్మరణమ్ము
మెండుగ నామది నుండ వలయు
సరియగు వేళకు మరువక పిలువగ
వలయునవ్యభిచార భక్తి ధనము
చింతల చిక్కక చింతన మానక
సంచిత గంధము త్రుంచి వైచి

నే నిరంతర ధారగ నిన్ను తలచు
చిత్త వృత్తి నిరోధక శిక్ష నిమ్ము
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 24

ఈ లోకములో నా ఉనికికి నీవే కారణము. నీ కృపలేనిదే క్షణమైనను మనలేను. త్రిసంధ్యలయందు భక్తిభావముతో నీ స్మరణసంపూర్ణమై ఉండవలెను. ఐహిక చింతలలో మునిగిపోక నీపై నిరంతర చింతన వదలక నిన్నే తలచు మనో నిగ్రహమ్మును నాకు ఒసగుము.

వారింప జాలమే వారిజాక్షుల పైన
సారింపగా దృష్టి తేరి పార
వారింప జాలమే భూరి దక్షిణలకై
జారేటి మా మతి నేరి కోరి
వారింప జాలమే బీరాల పలుకంగ
మాటి మాటికి దూకు నోటి మాట
వారింప జాలమే కోరి కొండెమ్ముల
వినగోరు వీనుల విషయ వాంఛ

పరుగు లాపించు మాచేత వరద హస్త
దారి మరలించి నీ దరి చేరనిమ్ము
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 25

ఓ భక్త వరద! స్త్రీ వ్యామోహమునుండి మనసు నివారించలేకున్నాను. ధనముపై ఆశ చచ్చుటలేదు. నా నోరు గొప్పలు చెప్పుచూ అహంకారమును పెంచుచున్నది. ఐహిక విషయములను ఆస్వాదించుటకు చెవులు ఆశ పడుచున్నవి. నా మనస్సు నా వాక్కు నా కళ్ళు నా చెవులు నా శరీరమంతయూ ప్రాపంచిక విషయాలకై పరుగులెట్టుచున్నవి. వాటిని దారి మళ్ళించి మీ కొరకు వెదకు మార్గమును ప్రసాదించుము తండ్రీ.

మమతానురాగాలు మఱుచోట ద్వేషాలు
వారు వీరన్నట్టి వేరు చూపు
జాతి లింగములందు నీతి నీమాలందు
వీలు వెంట బిరాన వాలు చుందు
హెచ్చు తగ్గులయందు వెచ్చించు సమయమ్ము
సకలమొకటె యన్న సమత మరచి
తర తమ భేదాలు తన మన భావాలు
తనుగతములె యన్న తలపు మాని

ఏల ద్వంద్వాల నీ చిందులేల నాకు
తెలుపు నిర్ద్వంద్వ మీవయె దిక్కు తండ్రి
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 26

ఓ సూర్య దేవా! ఒకరిపై మమతానురాగాలు మరొకరిపై ద్వేష జ్వాలలు జాతి లింగ భేదమును బట్టి నీతి నియమాల మార్పు ధనిక పేద ఉన్నత నిమ్న అను వర్గ భేదములు తరతమ భేదములు శరీరమునకే గానీ ఆత్మకు కావు అన్న విషయములను మరచినాను. నీవు నేను వేరు అనే భావమును వదలి నిన్ను చేరు దిక్కు ప్రసాదించుము తండ్రీ.

సురుచులు దుఃఖాంత సులభ సాధ్యమ్ములు
సుగుణాలు కష్టించ సుఖము గూర్చు
కనరాని వస్తువు కనుగొన మందువు
ముండ్ల వస్తువులుంచి కండ్ల యెదుట
పరువెత్తు మనసును పట్టుకొమ్మందువు
నవ రంధ్రముల నావ నడుమ నిలిపి
సూటిగా చెప్పిన సొమ్మేమి పోవునో
చోద్యమ్ము చూతువు చొరవ మాని

ఏల మాకీ ప్రహేళిక లేలనయ్య
వీలు వెంబడి నడుపుమా కేలు బట్టి
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 27

ఓ దేవా! సులభముగా లభించినను షడ్రుచులు దుఃఖమును కలిగించును. కష్టించి పెంచిన సద్గుణములు సుఖప్రదమగును. కళ్ల ముందు ఎన్నో ముళ్లవస్తువులుంచి పూలవలె వాటిని చూపించి కనపడని పరమాత్మని వెదుకమని ఆదేశించినావు. నవ రంధ్రములు కల ఈ శరీరము అను నావను నాకిచ్చి నిరంతర చంచలమైన గతిశీలమైన మనసును పట్టుకోమని పరీక్ష పెట్టుచున్నావు. పరమాత్మ స్వరూప స్వభావములను సూటిగా చెప్పక జీవులు నిరంతరము భ్రమలో కొట్టుమిట్లాడుతుంటే ఆ వింతలను చూస్తున్నావు. మా ఈ విప్పలేని జీవనయానము అనే పొడుపుకథలెందుకయ్యా.మా చేయి పట్టుకుని నీవెంట నడిపించి మోక్ష పదమునిమ్ము.

జగమంతయును పుట్టె స్వప్నమ్ము బోలిక
జనుల మనసులందు జడముగాను
కారణమ్మింతియే కన్పింప భిన్నత
నొక్కరూపమ్మైన పెక్కు గతుల
దుడుకు దూకుడునాప దూరమౌ స్వప్నమ్ము
క్షయమౌను మనుసుతో జగతిగూడ
చిన్న నిజమెటింగి నిన్నెఱుంగుటయెట్లు
మమ్ముంచ నీవిట్లు మాయలోన

మనసు గెల్వనిమ్మిక వేరు మాట వలదు
అడ్డులేక జగజ్జేత నౌదు నేను
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 28

ఓ తిగ్మకిరణ! ఈ ప్రపంచమంతా ఒక స్వప్నము, జడము. ఒకే రూపము అనేక రూపులుగా మారిననూ కారణభూతమైన పరమాత్మ ఒకటే. మనసును అదుపు చేసిన ఈ కలలన్ని దూరమగును. కోరికలు ప్రాపంచిక విషయాలు నాశనమగును. ఈ సత్యమును తెలిసికొని నిన్ను చేరుకొనుటకు మాయ అడ్డుపడుచున్నది. మనో నిగ్రహమును పొందు కోరికను పెంచి ప్రపంచపు మాయను జయించుటకు సాధనను కల్పించి నాకు విజయమును కలుగజేయుము తండ్రీ.

ఆంజనేయుఁడె సాక్షి యాజ్ఞవల్క్యుఁడె సాక్షి

గురువుగా నీవున్న కొదవ లేదు

భావి బ్రహ్మయెయ్యైన భయ భక్తి చరియించి

చదువంగ నీవెంట సాగెనంట

శక్తిమంతులకట్లు సాధ్యమగును గాని

శక్తిహీనులగు మా సంగతేమి

నా స్థితి గమనించి నన్నాదుకోవలె

నీసాటి వాడైన నీవెయ్యైన

వత్తువో పంపనెంతువో పరమ పూజ్య

నిర్ణయమ్మును తెల్పు నా కర్ణమందు

భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద

దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 29

ఓ దినకర! ఆంజనేయునికి యజ్ఞవల్క్యునికి నీవు గురువువై అపార జ్ఞానసంపదనిచ్చినావు. వారు శక్తిమంతులు కావున నిన్ను సులువుగా చేరగలిగినారు. అశక్తులవంటి మావంటివారు నీ ప్రాపును ఎట్లు పొందగలరు. మా పరిస్థితి గమనించి మమ్ము రక్షింపుము. స్వయముగా నీవైనను నీవంటివారినైనను పంపి ఆదుకొనుము. శీఘ్రముగా నా చెవిలో నీ సాధనా మార్గమును ఉపదేశించి నన్ను తరింపజేయుము.

శ్రీకంఠునొక్కని సేవింతురే గాని
శ్రీకాంతుడన్నచో చేరరసలు
చంద్రసోదరి భర్త సంగతి నుందురు
చంద్రశేఖరుడన్న చనరు వినరు
మూర్తి త్రయమ్ములో మొదటివాడే గాని
గుడియైన నున్నట్లు గురుతు లేదు
ముగ్గురంశల దాల్చి మూడు సంధ్యలయందు
వీర భక్తుల పేర పోరు తీర

సర్వ సాక్షివి నీవంచు సమ్మతించ
భళిర మా మాయ రోగమ్ము బాపినావు
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 30

ఓ సవితా! తమ తమ దుఃఖ నివృత్తికై కొందరు కేవలము శివుని ప్రార్థించెదరు. మరికొందరు విష్ణుమూర్తినే ఆరాధించెదరు. త్రిమూర్తులలో మొదటివాడైన బ్రహ్మకు అర్చనా యోగమే లేదు. బ్రహ్మ విష్ణు మహేశ్వర స్వరూపుడవైన నిన్ను అన్ని కర్మలకు సాక్షిగా భావించి త్రిసంధ్యలు చేయు భక్తులు ముక్తిని పొందుచున్నారు. దైవమొక్కటే అను విషయమును తెలిపి మా భేద భావములను రోగములను తొలగించి మమ్ము రక్షింపుము.

నిస్సార కాసార నిర్వేతు సంచార
కుసుమశర వికార కుహార గహన
నిబిడాంధకారవన్నిస్తేజ సంసార
నిర్భీతి ధిక్కార నియత సాధ్య
నిజ దేశికాదేశ నిష్కామ పరిపాక
నిష్ఛేద బ్రహ్మాత్వ నికట గమన
హార కేయూర మంజీర రంజిత పాద
యోగ భోగ పరాగ రాగ త్యాగ

సఫల నిర్గుణ తత్త్వ విచార సార
ఘోర పరివార సంసార భార దూర
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 31

ఓ తిగ్మకిరణ! ఈ సంసారము అంధకారమయము నిస్తేజము. కానీ కాంతా కనకాదుల వెంబడి వెర్రి పరుగులాపి సంసార బాధలను దూరముచేసికొని, మోహపడక దుఃఖరహితమైన బ్రహ్మతత్త్వము తెలిసికొనుటకు గురూపదేశమును ప్రసాదించి శాశ్వతానందము కల్గజేయుము.

**ఇటువారికుదయాద్రె యటువారికస్త్రాద్రి**
**చూచు స్థానము బట్టి చోటు మారు**
**ఏక రూపమ్ముతో నెల్ల వేళల వెల్గు**
**తేజమ్ము నీవన్న తెలివి మరచి**
**మానక దిరుగుచో మార్పు నాపాదించి**
**నిజమైన భ్రాంతినే నిజమనంచు**
**ఒక కొండ యెగురంగ నొక కొండ యొరగంగ**
**రెండు కొండల నడుమ రేబవలని**

**తనకు తోచిన దొక్కటే తత్త్వమనెడి**
**హ్రస్వ దృష్టిని తప్పించి రక్ష నిమ్ము**
**భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద**
**దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ** **32**

ఓ దేవా! తూర్పు కొండలలో ఉదయించి పడమటి కొండలలో అస్తమించెదవని మా భ్రమ. ఈ నడిమి సమయాన్ని రాత్రి పగలు అను భ్రమతో అజ్ఞానముతో బ్రతుకుచున్నాము. జననము మరణము జీవనము అను చక్రములో నీ తత్త్వము తెలియక దారి తెలియక భ్రమించుచున్నాము. ఒకే రూపుతో అన్ని సమయాలలో జ్ఞానము అను వెలుగును ఇచ్చు రూపము నీదని మరచుచున్నాము. నిరంతరము భ్రమించుచు ఋతువులమిషతో మార్పులు చేయుచూ ఆ భ్రాంతినే నిజమను భావన కలుగునట్లు చేయుచున్నావు. ఈ భ్రమలను తొలగించి నన్ను కాపాడుము.

ఎన్నాళ్ళు తిప్పెద వెన్నాళ్ళు తిరిగేను
కొండాడుటందున కొదువ కలదె
కొండంత స్వామికి కొండంత పత్రియా
భావ బలిమి జూడు బాట గాదు
మిన్నున చూడంగ కన్నార కన్పించి
వెన్నంటి నిల్చేటి వేల్పు వంచు
చిన్ననో మిన్ననో చెన్నార పూజింతు
నన్నేలవేలనో సన్నుతించ

నెన్నగాను జగచ్చక్షు వీవ నంద్రు
నేను నీవాడ గానటో కాన రానో
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 33

ఓ సవితా! నన్ను ఈ జనన మరణములను చక్రములో ఎన్నాళ్ళు నడిపించెదవు. నీ ఆటకు అంతము లేదా? నేను చేయు విన్నపములు తక్కువైనవా? నీవు కొండంత స్వామివి. నేను కొండంత పూజ చేయలేను కదా. పూజా సామగ్రిని అందించలేను కదా. నా భక్తిని చూడుము. కనులెత్తి చూసిన ఎదుటనే కనిపించి నా వెంట నిలిచి కాపాడుము. నా శక్తి కొలది పూజిస్తాను. నిన్ను కొలుస్తాను. నీవే దిక్కు అని వేడుకుంటాను. నన్ను రక్షించుము. నా మంచి చెడ్డలను, పాపపుణ్యములను భరించువాడవు. అన్ని కదలికలను గమనించువాడవు. నేను నీ భక్తుడను కానా? నన్ను నీ దరిచేర్చి రక్షించు స్వామీ.

ఒక రోజు బుట్టంగ నొక రోజు గిట్టంగ
నా రెంటి నడుమదే యాయువంచు
పుట్టి గిట్టుట పేర నట్టిట్టు తిరుగాడి
కొట్టు మిట్టాడు నీ బొట్టె నేను
గట్టిగా యేడ్చినా పట్టించు కొనకున్న
నొట్టి మాటలు నీకు పట్టవంచు
నీ చుట్టు దిరుగుట నీకు నా గతి తెల్పి
తిరుగుడు తప్పించు తెరవు కొఱకు

బెట్టు సేయక చట్టన గట్టి పట్టు
పట్టి గట్టునెక్కించగ దిట్టవంచు
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 34

ఓ ప్రభాకర! జననమరణముల మధ్య భాగము ఆయువు. ఈ జనన మరణ మిషతో మాయా జగత్తులో తిరుగుచు కొట్టుమిట్టాడుచున్న నీ బిడ్డను నేను. ఎంత ఏడ్చినా పట్టించుకొనవు. ఇకనైనా నా మనో వాక్కర్మలు నీ చుట్టూ తిరుగు మార్గమును చూపించి జనన మరణములను తిరుగుడు తప్పించి నా చేయి పట్టుకుని ఈ మాయ నుండి పైకి లాగి ముక్తి కలిగించుము స్వామి.

మిత్రుని కంజలి మేల్జోతలు రవికి
ప్రణతి సూర్యునికిడి భాను మ్రొక్కి
ఖగ పూష యంచును కైమోడ్పులర్పించి
పైడి గర్భునికింత ప్రాంజలించి
మా మరీచికి భక్తి మనసార శిరమొగ్గి
ఆదిత్య సవితాఖ్యు నర్చ జేసి
అర్క భాస్కర నాము కభివాదముల్జేసి
వందనంబులు చేతు వంగి వంగి

దేవ దీర్ఘ రోగమ్ముల దివిచి వైచి
ఆయురారోగ్య భాగ్యాల నంద జేయ
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 35

ఓ దేవా! నీకు అంజలి ఘటించి మ్రొక్కెదను. నమస్కరించెదను. ఒంగి చేతులెత్తి మొక్కెదను. మిత్రాది ద్వాదశ నామములు కలనీవు సూర్యనమస్కార విధినాచరించిన జీవులలోనున్న సమస్త రోగములను హరించెదవని ప్రతీతి. నా రోగములను బాపి నన్ను కాపాడుము.

విశేషాంశము: సూర్య నమస్కారములలోని పన్నెండు నామములు అదే వరుసలో పొందుపరచబడినది.

ఒంటి చరింతువు జంట బాటల వెంట
మూడు సంధ్యల గొల్వ మూర్తి వంట
వేద చతుష్టయ వేద్యుడ వీవంట
పంచకోశాంతర వాసి వంట
షడృతు కర్తవు నంట సప్తాశ్వ రథివంట
అష్ట కష్టమ్ముల నణతు వంట
నవ విధ భక్తుల నమ్మి గొల్చెడి వారి
నీడవై కాపాడి నిల్తువంట

వేల కిరణాల వేల్పురో వేడుకొందు
ఏల జాగేల నన్నిక నేలు కొమ్ము
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 36

ఓ భక్తవరద! తూర్పు పడమరలను రెండు మార్గములలో ఒంటరిగా తిరుగుచున్నావు. దైవమొక్కటే అని దాని పరమార్థము. త్రిసంధ్యలలో పూజలందుకొనువాడవు. చతుర్వేద మూర్తివి, ఆత్మను అంటిపెట్టుకున్న అన్నమయ, ప్రాణమయ, మనోమయ, జ్ఞానమయ, ఆనందమయమను కోశములందు చరించువాడవు. ఆరు ఋతువులకు మూల కారకుడవు. గాయత్రి, బృహతీ, ఉష్ణిక్, జగతీ, త్రిష్టుప్, అనుష్టుప్ పంక్తి అను ఏడు గుర్రాల రథమునెక్కి చరించువాడవు. దాస్యము దారిద్ర్యము భార్యావియోగము యాచకము ఋణము ప్రయాణము స్వయంకృషి దానము చేయలేకపోవుట అను ఎనిమిది కష్టములను పోగొట్టువాడవు. శ్రవణము కీర్తనము స్మరణము పాదసేవనము అర్చనము వందనము దాస్యము సఖ్యము ఆత్మ నివేదనము అను తొమ్మిది భక్తి మార్గముల నిను కొల్చువారల కాపాడి వారి వెంట ఎల్లవేళలా నిలుచువాడవు. ఓ స్వామి! వేల కిరణాలు అను చేతులతో నన్ను పట్టి కాపాడుము.

బంధు పోషణయందు బహు నేర్పరివి నీవు
శౌర్య పరాక్రమశాలి వీవు
పర పీడనమ్ముల పరిహరింతువు నీవు
గ్రహబాధలంటమి రక్ష వీవు
ఆత్మ వదందరినాదు కొందువు నీవు
అన్ని వైపుల యందు నభయమీవు
ఎట్టి శూన్యమునైన నిట్టె మాయము జేసి
మట్టు బెట్టెదవెట్టి మాయనైన

కేల కుసుమాల మాలలు చాలి గాదు
లీల నాయందు ననురాగ హేలగాని
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 37

ఓ సవితా! మేఘాలను పోషించి జీవులకు ఆనందమునిచ్చువాడవు. శౌర్య పరాక్రమములు కలవాడవు. అరిషడ్వర్గముల బాధల నుండి గ్రహబాధలనుండి రక్షించువాడవు. భయమును శూన్యమును మాయను తొలగించి మమ్ము కాపాడు వాడవు. మేము అర్పించు పూలమాలల కొరకు కాక మా యందు అనురాగముతో మమ్ము రక్షించుటచే నీవు భక్తవరదుడవు.

భళిర ధరామృతమ్మళి భంగి గొంపోయి
జలధరమ్ములయందు సంగ్రహించి
కలవారి కడదీసి వలయువారికినిచ్చి
జగతి జీవింపగ మిగుల బంచి
తపన స్నపన కేళిదనరంగ గావించి
సకల లోకమ్ములు సంతసించ
కనరాక కన్పట్టి యనుకంప వర్షించు
సాంద్ర కృపానిధీ శరణు శరణు

ఇంద్రుడై వివస్వానుడై యిలను గాచు
నీశ్వరా శాశ్వతానంద మీయ వయ్య
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 38

లోకములో ఉన్న నీటిని తేనెపట్టునందు తేనెటీగ తేనె కూర్చినట్లు నీ కిరణములతో సంగ్రహించుచున్నావు. సంపన్నుల ధనమును నిరుపేదలకు పంచినట్లు మేఘ సంచయము ద్వారా ప్రపంచమునకు ఆ నీటిని పంచుచున్నావు. లోకము ఆనందమొందునట్లు నీటిని తపింపజేసి తిరిగి వర్షింపజేయు ఈ క్రీడ నీకు మా పైగల అనురాగమునకు తార్కాణము. అట్టి కృపగల నిన్ను శరణు వేడుచున్నాను. ఇంద్రుడవై వివస్వానుడవై ఈ భూమిని కాపాడునట్లు మోక్షమును శాశ్వతానందమునిచ్చి నన్ను తరింపజేయుము.

విశేషాంశము: వర్ష ఋతువునందు శ్రావణ భాద్రపదమాసములందు సూర్యుని తేజమునకు ఇంద్రుడని, వివస్వానుడని పేర్లు.

సత్త్వ రజస్తమాసక్తులు స్త్రీలట
అరయ నావలి వాడె పురుషుడంట
ఈరీతి గమనింప నేడేడు లోకాల
నెల్లవారతివలే యీవు దక్క
నీ ప్రియ భావిని నేనై పరితపింతు
దరిజేర్చి కాపాడు ధవుడవౌచు
సంశోధనలు మాని సంతాపములు దీర్చి
సంసార బంధాల సమయ జేసి

మదిని నీ యందు రతి గల్గి ముదము నొంద
వరము నిమ్మంచు నా స్వామి వదల నిన్ను
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 39

ఓ ఆదిత్య! ఈ లోకము సత్వ రజో తమో గుణములతో కలసిన స్త్రీ. నీవు పురుషోత్తముడవు. పదునాలుగు లోకాల జీవరాశులన్నీ స్త్రీత్వము గలవారే. మీ ప్రియభామను నేను. నా మనో ధవుడవైన నీవు పరీక్షలు పెట్టక నా దుఃఖములను బాపి సంసార బంధాలను తెగగొట్టి నిశ్చలమైన మనసును కలుగజేసి పరమానందము పొందగల స్థితిని కలిగించి నన్ను నీ దరిని చేర్చుకొని కాపాడుము. నాకు నీవు తప్ప వేరు గతిలేదు

దుఃఖ పడుటవల్ల దురితమ్ము తొలగునే
దైవ బలము కల్గ ధైర్యమబ్బు
ఇసుమంత జరిగిన నీశ్వరేచ్ఛయె గాని
నితరమ్ము కాదన్న ఋతము కాదె
సంచితాదుల భుక్తి నుంచక ధృంచుచో
దైవ దూషణ జేయ తప్పు గాదె
శరణు జొచ్చిన వారి కరుణించి కాపాడి
రక్షింతువే గాని శిక్ష లీవు

చిత్తమందు నీభావము స్థిరము గాగ
చంచలత్వము లేకుండ నుంచమనుచు
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 40

ఓ భాస్కరా! పూర్వ జన్మ కారణభూతమైన పాపకర్మలను అనుభవించుచు, దుఃఖించినను పాపము తొలగదు. దైవచింతన తో ధైర్యము కలుగును. జగత్తున కల అన్ని కార్యములను దైవనిర్ణయము, ఆదేశము అని భావించవలెను. సంచిత కర్మలను తొలగించుకొనక దైవమును నిందించుట దోషము. అచంచలమైన మనసుతో భక్తి భావముతో నిన్ను శరణుకోరిన వారిని కరుణతో రక్షించెదవు.

సత్సంగ ఫలితమౌ స్మరణ శ్రీ గంధంబు
చేత బట్టితి నీదు సేవ కొఱకు
విషయ వాంఛల గోసి విరులుగా భావించి
అర్పింప నెంతునే నార్తి తోడ
బహుజన్మ సంచిత వాసనలన్నింటి
ధూపమ్ముగా జేసి చూపనెంతు
చిఛ్ఛక్తి దీపమ్ము సిద్ధ పరచినాడ
నారగింపులు చేయ కోరికలను

హృదయ మందుదయించగ కదలి రమ్ము
వేగ నా పంచపూజలు స్వీకరించ
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 41

ఓ ఘృణిసంజ్ఞా! గురువు అను సత్సంగ ఫలితముగా లభించిన మంత్రోపదేశమను గంధమును చేతపట్టుకుని నీ సేవకొరకు వేచియున్నాను. లౌకిక విషయవాంఛలను పూలుగా ఆర్తితో అర్పించుచున్నాను. జన్మజన్మల నుండి వచ్చుచున్న సంచిత ప్రారబ్ద కర్మలను ధూపముగా చేసి సమర్పించుచున్నాను. నా మనసును దీపముగా సమకూర్చుచున్నాను. నా కోరికలను నీకు నివేదనగా సమర్పించుచున్నాను. ఓ దేవా! నా మనసులో జ్ఞానమను ఉదయమును కలిగింప జేసి నా పంచపూజలను స్వీకరించుము.

అమృతత్వ మొందగ త్యాగ శీలురగుచు
లోని చూపు కలిగి లోతు లెఱిగి
వేదాంత విజ్ఞాన విషయజ్ఞు లౌచును
లంపటమ్ములు లేక లక్ష్యమెఱిగి
ప్రణవార్ధ సంధాన ప్రణవాత్ములైనట్టి
చారు చరితులు నీ సాటి వారు
మచ్చు కొకటియైన మావద్ద లేవంచు
పట్టించు కోకుంట పాడి కాదు

యుక్త విషయగ్రహణ శక్తి యుక్తి గరపి
ముక్తి కాంత కొఱకు నసురక్తి నిమ్ము
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 42

ఓ దివసకర ! ఈ ప్రపంచపు అసలు విషయమును గ్రహించి దాని లోతులను తెలిసికొని త్యాగము వేదాంత జ్ఞానము కలిగి వుండి భవబంధములను తొలగించుకొని, ముక్తియే లక్ష్యముగా గుర్తించి సృష్టి మూలమాతృకలై ప్రణవ రూపులైనవారు సచ్చరిత్రులు జీవితమున అమృతత్వమును పొందుదురు. నేను ఇట్టి గుణములేవియూ లేనివాడను. అయిననూ చిన్న చూపు చూడక వదలి వేయక ఉచిత విషయ గ్రహణ శక్తినిచ్చి అమృతత్వము కలుగజేయుము.

ఎటులడ్డు లుడుగు, నేనీ మాయ తొలగంగ
నేమి సేయ వలెనో, యెయ్యది గతి
ముడివడు చిక్కుల విడదీయ సాధ్యమో
దుర్భేద్యమో యెటున్ దోచదాయె
సుప్తమౌ హృదిపొంగ లిప్త కాలము జాలు
మాయ నర్తన జేయు మనసు సమయ
తారాధిపు వెరపుల్, హోరాది తలపులున్
భ్రమ వెట్టి నన్నేల వదలి పోవు

లెమ్ము హృది నివాసము జేసి కొమ్ము రమ్ము
రయముగ నినుగని మనసు లయము గాగ
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 43

ఓ వరేణ్యా! మాయ నిండిన ఈ మనసుతో ఏవిధముగా ప్రాపంచిక విషయముల అడ్డు తొలగించుకొందును. మాయ తొలగించుటకు దారి ఏది? బంధములను చిక్కులను విడదీయుట ఎట్లు సాధ్యమో తెలియరాకున్నది. నక్షత్రములు హోరలు అను భ్రమను కల్గించి నన్నీ లోకములో వదలి వెళు తున్నావు. నీవు తలచిన నిమిషమునందే హృదయ పరిపక్వత నీయగలవు. జ్ఞానము కలుగజేయగలవు. వేగముగా వచ్చి నన్ను నీయందు కలుపుకొనుము.

ఎచటనాత్మానంద మెచటనాత్మానంద
మంచునే నిటు సంచరించి దుఃఖ
ఘన విరామానంద కళికలున్నీవన్న
యెఱుక లేకుంటినదేమి లీల
ఒగి పరమానంద మొందుట యెట్లంచు
సందియ మందున కుందనేల
సతత పరానంద సంధాన తుందిల
హృదయమ్ము కల్గుట పదిలమంచు

శాంత చిత్తాన సాధన సఫల మనగ
నిట్టి యానంద మావిష్కరించుమయ్య
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 44

ఓ భక్తవరద! భవ దుఃఖములను తొలగించువాడవు నీవని తెలిసికొనలేక పరమానందము ఎక్కడ ఎక్కడ అని వెదకుచున్నాను. దానిని పొందుటకు పరితపించుచున్నాను. ఇతరుల ఆనందమే తన ఆనందముగా తలచుట ఉత్తమ లక్షణం. శాంత చిత్తముతో తపో సాధన సఫలమగును. సహృదయమును శాంత చిత్తమును కలుగజేసి పరమానందము పొందు మార్గము చూపుము తండ్రీ

క్షుద్బాధకోర్వక హృద్బాధకోర్వక
నున్నదానిని పెంచి యునికి మార్చి
చింతించు తరుణాన చిత్తమందిసుమంత
శోభనొందదు గాని క్షోభ నొందు
కలుఁగఁ జేసిన గాని తొలఁగఁ జేసిన గాని
నా మంచి కొఱకంచు నమ్మ లేక
పాపముల్ తొలగింప బాధల వెట్టిన
పట్టదనుచు దుయ్య బట్ట తగునె

ఇంత చంచల మీ చిత్తమేల నయ్య
వలదు నాకది నీ వద్ద వదలివైతు
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 45

ఓ దివసకర! ఆకలి అనుచు బాధలు అనుచు చింతించిన మనసులో క్షోభయేకానీ ఆనందము లేదు. సంపదనిచ్చిననూ పోగొట్టినను అది నా మంచికొరకే యని అది నీ లీల యని తెలుసుకొనలేక పోవుచున్నాను. సంచిత పాపములను తొలగించుటకు బాధలు పెట్టుచున్నావని తెలియక నిన్ను తిట్టుకొనుచున్నాను. తెలిసినను తెలిపినను నమ్మని చంచలమైన ఈ మనసు నన్ను బాధించుచున్నది. దయ యుంచి శాశ్వతముగా నా మనసును నీకడకు చేర్చుకొనుము.

తమ సొత్తు యన్నట్లు తమకడ్డు లేనట్లు
గగనభాగమ్మంత గప్పివైచి
మినుకు మినుకుమంచు మెఱుగులు చూపించి
సొగసులొలక బోయు చుక్కలన్ని
దొరగారి గాంచిన దొంగల చందాన
పట్టుబడుదుమన్న భయముతోడ
కనినంతనే నిన్ను కన్పింప కుండగా
కనుమరుగగునంట క్షణము లోన

చిద్గగన మందునుదయించు శీఘ్ర గతిని
ఆరు చుక్కలు కామాదు లంతరించ
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 46

ఓ దేవా! ఆకాశమంతా తారలు వ్యాపించి తన స్వంత ప్రదేశముగా భావించి చీకటిలో రాజ్యమేలుతాయి. తూర్పు దిక్కున నీవు ఉదయించగనే దొరవారిని చూసిన దొంగలవలె కనుమరుగవుతాయి. అదే విధముగా నా మనసులో ఉదయించి దానిని వికసింప జేసి కామాది అరిషడ్వర్గములు అను శత్రువులను నా నుండి దూరము చేయుము తండ్రీ

అర్చించు తరుణాన యర్పింప రాదంచు
మారేడు పత్రన్న మరువ మండ్రు
మారేడ నీపేర మా  రేడు కలడనా
తేనీరు శివమైన త్రిదళములను
అన్ని నీవే యౌచు నన్నింట నీవుండ
చెట్లు చేమల వైర మెట్లు పొసగు
అల్పత్వమందునా అజ్ఞానమందునా
అపచారమందునా రిపువునౌదు

వలయు సాధన సంపద వరములొసగి
స్థిరత నుద్ధరింపుము తండ్రి తిమిర హరణ
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర  వరేణ్య సవితా తిగ్మ కిరణ 47

ఓ తిగ్మ కిరణ! నీకు మారేడు దళములు పూజార్హములు కావందురు. నీ పేరులో నారయణ శబ్దముండుట వలన శివప్రీతికరమైన దళములు పనికిరావా? అన్నీ నీవే అన్నిటా నీవే. చెట్లు చేమల పేరిట ఈ భేదమెందుకు? ఇది అజ్ఞానము స్థాయి లేకపోవుట. అపచారము కూడా. అట్లన్నచో నేను లోకవైరినగుదును.  కావున నాకు వలయు సాధనా సంపత్తినిచ్చి నన్ను ఉద్ధరింపుము తండ్రీ.

మోహ వస్తువులన్ని మొగము ముందరయుండ
యూహలందున కూడ మోహ పెట్టు
వాని వెంట మసలి వాని నుండి మరల
చెప్పఁ దేలిక గాని చేయుటెట్లు
ఆలు బిడ్డలటంచు నన్న దమ్ములటంచు
బంధు హితులటంచు పట్టకుండ
నాలోన నేనుగా లోలోన తిరుగాడ
క్రూరాత్ముడందురే కొద్ది మతులు

ఆటలాడించి మురిసేటి పోటుగాడ
చేటులుడిగించి నను నీవె చేదుకోర
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 48

ఓ భక్తవరద! భ్రాంతి కల్గించు వస్తువులను కట్టెదుట పెట్టి వాటితో కలిసి జీవించి వాటినుండి మనసును మరల్ప వలెను అని చెప్పుట ఎంతో తేలికైనది కాని కష్ట సాధ్యము. భార్య పిల్లలు అన్నదమ్ములు బంధువులు మేలుకోరువారు అను బంధములను విడచి వేదాంతిగా తిరిగినను నన్ను చాలా క్రూరుడు అంటారు. భౌతిక విషయములు సంసార బంధములు ఆకర్షణములు అను ఆటలాడించు ఓ జగన్నాటక సూత్రధారి నీ ఆటలు కట్టిపెట్టి నన్ను దరిజేర్చుకొని కాపాడుము.

కశ్యపాత్మజుడంచు కమలాప్తుడంచును
పరమాత్మ నిన్నింత ప్రస్తుతించ
స విలాస హాసినీ సమ్మోహ విద్యల
మర్మమరసి రోసి మాయ తొలగి
కనగా శత సహస్ర కౌముదీ తుల్యమౌ
యానంద యోగమ్ము ననుభవించి
యార్ద్రమై వెల్గొందు యగ్ని శిఖనొకచో
నాద్యంతములు లేని యంత జేసి

భూరి ఫలమిచ్చు నిను నేను పొగడ వశమె
కాదు నా శక్తి నీ యనుకంప గాని
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 49

ఓ వరేణ్యా! బ్రహ్మ వంశజుడవని కమలబంధువని నిన్ను ప్రశంసించిన చో ఈ మాయలన్నింటిని తొలగించుకుని వేల వెన్నెల వెలుగులతో ప్రకాశించు పరమానందమును అనుభవించవచ్చును. జనన మరణములు లేకుండ ముక్తి కలగజేయు గొప్ప ఫలములనిచ్చు నిన్ను నేను పొగడగలనా? ఈ దీనుని దరిజేర్చుకొని శక్తినిచ్చి ముక్తి కలగజేయుము.

కర్మలఁ జేయక కైవల్య మెటులబ్బు
కనుక దానను గొప్ప కనమనంద్రు
సాధించ దగుదాని శ్రద్ధగా జేయుచో
ఫలితమందున దృష్టి నిలుపనేల
భక్తి గల్గక యున్న ముక్తి గల్గదు కాన
మోక్ష సాధనమందు ముఖ్యమంద్రు
నిజ వస్తు జ్ఞానమ్ము నిక్కమ్ము దొడ్డది
నివురు తొలగి పోయి నిప్పు తెలియ

ఒకటికొకటి కావలెనున్న దొకటి తెలియ
వేరనుచు పోరు తెలియమి వెర్రి గాదె
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 50

ఓ భాస్కరా! తగిన సాధన చేయకున్నచో సత్కర్మ ఆచరించకున్నను స్వధర్మమును నిర్వర్తించకున్నను మోక్షము రాదు. శ్రద్ధగా లక్ష్య సాధన కొరకు సాధన చేసిన ఫలితము గూర్చి విచారింపవలసిన అవసరము లేదు. మోక్ష సాధనలో భక్తిలేకున్నచో ముక్తిలేదు. బూడిదను తొలగించిన నిప్పువలె మాయను తొలగించినచో అనంతమైన సత్యము గోచరించును. అట్టి సత్య సోధనా మార్గమును నాకొసంగుము.

చదువులవన్నియు చదువుటదేటికి
చదువగ నీదగు చదువులేక
పౌరుషమేలనపౌరుషేయాఖ్యల
నామ్నాయ మొనరింప నాశ లేక
దుంపల పిలకల దుంపగ లంపట
మెట్టైన తొలగించు నిచ్ఛ లేక
ఏరేరి దురితమ్ము లేరేరి పోకార్చు
గురువులేరనుటకు గురుతు రాక

జన్మలన్నింట నుత్తమ జన్మ యేల
పతిత పావన నినుజేరు గతిని మరువ
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 51

ఓ దేవా! నీ విషయమును చర్చించని చదువులు వ్యర్థములు. వేదవిదితుడవైన నీ నామ స్మరణ చేయు ఆశ లేనిచో పౌరుషము వృధా. భౌతికవాంఛలు విషయములను బంధములను తొలగించు కోరిక లేకపోయినచో దుంపలను వదిలి పిలకలను తొలగించిన విధమే యగును. పాపములను ఏరివేయు గురువుల సన్నిధి గుర్తురాక జీవించుచున్నాను. ఓ పతితపావనా! నిన్ను చేరు మార్గము తెలియని ఈ మానవ జన్మ ఎందుకు? అది ఉత్తమమైనను వ్యర్థమే కదా. నన్ను పవిత్రుని జేసి నీ దరి జేర్చుకొనుము.

కాంతి కల్గంగను కారణమ్మగుటచే
భాస్కరుండను పేర బలకరింతు
బ్రహ్మాండ మంతయు బ్రతికించెదవు గాన
మార్తాండుడను పేర కీర్తి కలిగె
హరియించ తమమును హంస యంటిని నిన్ను
పోషించెదవు గాన పూష యంటి
లక్షణమ్మును బట్టి లక్ష్యించుటకు గాను
పెట్టుకొన్నవి పేర్లు పెక్కు గలవు

అసలు నీ పేరు తెలుసుకొని మసలు కొనగ
పుట్టు పూర్వోత్తరమ్ముల గుట్టు తెలుపు
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 52

ఓ భాస్కరా! వెలుగునిచ్చువాడవు కావున నిన్ను భాస్కరుడు అని పిలిచెదరు. బ్రహ్మాండమునకు జీవమునిచ్చువాడవు కావున మార్తాండుడని కీర్తి వచ్చెను. ఆత్మ పరమాత్మ అను భేదము తొలగించు జ్ఞానము నిచ్చువాడవు కావున హంసయని పిలిచెదరు. ప్రపంచమునకు శక్తినిచ్చువాడవు కావున పూష అని కొనియాడెదరు. నీ లక్షణములనేకములు. నామములు అనంతములు. నీ ఆది బ్రహ్మతత్త్వమును పరమాత్మ స్వరూపమును తెలిసికొను జ్ఞానము ప్రసాదింపుము తండ్రీ.

ఘన ఘనాఘన గత ఘనరసమ్మిల పైన
జల జలా జారంగ జగతి మురియ
గంగ కృష్ణ యమున తుంగభద్రలనుచు
పేర్లు పెక్కుగ పెట్టి వేరు సేయ
నుండబట్టగ లేక యురికి యురికి వేగ
నుదధి లోనికురికెనునికి సమయ
నీదు శక్తియు లేక నీరు నీరదమౌనె
నీరదమ్మగునొకో నీరు గాను

మొరలు వినుమద్వయానందకరుడ వనగ
తనరు మాయల తొలగించు ఘనుడవనఘ
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 53

ఓ సవితా! దట్టమైన మేఘములు జలజలా నీటిని వర్షించి జగతిని ఆనందింపజేయును. ఆ నీటిని గంగ యమునా తుంగభద్ర అను అనేక పేర్లతో పిలిచి వేరుచేయుచున్నాము. అవి విడివిడిగా ఉండలేక తిరిగి సముద్రమందు చేరి ఏకమగుచున్నవి. నీ శక్తిలేక నీరు మేఘము కాదు, మేఘము నీరు కాదు. ఈ మాయలను తొలగించి నీవు నేను అను వేరు భావమును మాలో త్రుంచి నీలో లీనమగు దారి చూపుము తండ్రీ.

కనిపించనట్టిది కల్పించుచున్నదే
కనిపించునది యంత కలిగినట్లు
కదలాడు చుండెనే క్షణ కాలమాగక
కలదాని కనకుండ కళ్లు గప్పి
పట్టి బంధింపగ పలుమారులెత్నించ
పట్టు బట్టితి గాని పట్టు బడదె
కలలన్ని కరిగించి కలదాని పరికించ
కట్టి వేయగ రాదె కరుణ తోడ

చంచల నచంచలను జేసి చంచరీక
గతిని నీ పాద పద్మమ్ము కడను నిల్ప
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 54

ఓ దినకర! నా మనసు కనిపించక పోయినను అనేక కోరికలను ఊహలను కల్పించుచున్నది. క్షణము కూడా స్థిరముగా నుండక సత్తును చూపించక కదులుచూనే ఉన్నది. ఎంత ప్రయత్నించినను బంధించుటకు వీలు కాకున్నది. నా భ్రమలను తొలగించి లక్ష్యమును సూచించి నా మనసును కట్టివేయుము. చంచలమైన మనసును కదలకుండా చేసి, నీ పాదపద్మముల వద్ద తేనెటీగ వలె వ్రాలునట్లు చేసి నీ భక్తి మాధుర్యము పొందునట్లు చేయుము.

భిక్షాన్నమేలన్న వినయ మబ్బుటకండ్రు
గురుని యెంగిలి ముద్ద గోచి పాత
ఇంద్రియమ్ముల వాని యిష్టాని కొదలక
నిగ్రహించుక నుంచు నియతి కొఱకు
అభ్యసించిన విద్య అర్థించినది విద్య
సత్యమైనది విద్య శ్రద్ధ విద్య
పెద్దలందున భక్తి వేదమందనురక్తి
పరహితమాసక్తి సరస యుక్తి

కఠిన మైనను క్రమశిక్ష గరపి నడుపు
గురుకులము నిన్నెఱుఁగుటకు గురుతు కొఱకు
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 55

ఓ దేవా! విద్యవలన వినయము ఇంద్రియ నిగ్రహము అలవడును. గురుకులములలో భిక్షాటన గురువుల భుక్తశేషము కౌపీన ధారణ ఇవన్నియు వినయ ఇంద్రియ నిగ్రహములకు దోహద పడును. సత్యమైనది శ్రద్ధకలది గురుభక్తిని నేర్పునది వేద సముపార్జనయందు ఆసక్తి పెంచునది పరోపకారమునకు ఉపయోగపడునది అందరికి ఆనందము చేకూర్చునది అయిన విద్యను కఠినమైన నియమాలతో సద్గురువు వద్ద అభ్యసించవలెను. విద్యలన్నిటికి మూలమైనది నిన్ను తెలిసుకొను బ్రహ్మ తత్త్వము. దానిని ప్రసాదించుము స్వామీ.

నీ లీల విభవాన నింగి చేరిన  నీరు
చిరు చుక్కలై భువి చేరు వేళ
లోక హితముగూర్చు మీకు శుభమనుచు
నుదుట ముద్దు వెట్ట మదిని మురిసి
దరహాస మొనరింప హరి విల్లుగా మారె
ఆకాశమంతటా నావరించి
నేనొక బిందువు నీ యందు కానటో
ననుగూడ దయజూడు నయముగాను

అహరహము వికసించు నా దహరమందు
సుప్తమౌ తేజముదయింప సప్త గతుల
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర  వరేణ్య సవితా తిగ్మ కిరణ 56

ఓ తిగ్మకిరణ! నీ లీల వలన నేలపై నీరు ఆకాశమును చేరి చిరుజల్లుగా వర్షించి లోకమునకు హితము చేయును. నీ స్పర్శ సోకి ఆ నీటి బిందువులు ఆనందించి ఏడు రంగుల ఇంద్ర ధనస్సుగా మారి లోకమునకు అందమును చేకూర్చును.  ఓ దేవా! నీనుండి వచ్చిన ఒక బిందువును నేను. నా పై దయచూపి నా హృదయమందు ఉదయించి అజ్ఞానమును తొలగించి సప్త కిరణములను  ప్రసరింపజేయుము.

నీ స్ఫూర్తి కల్గించు నీదు చర్చల విన్న
రిపులన్నగాని గరిపాడవవలె
మాయ పొరల దృష్టి మరలించి కన్నుల
నీ దివ్య రూపమ్ము నే కనవలె
లౌకిక విషయమ్ములనుగాక వీనుల
నీ భవ్య లీలల నే వినవలె
జాగ్రదాదులయందు జాగరూకత కల్గి
నీ సత్య నామమ్ము నేననవలె

యిన్ని మాటలెందుకు గాని నిన్నడిగెద
వదలకయె నుండు నాలోని శ్వాస వోలె
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 57

ఓ దేవదేవా! నీ విశిష్టతను తెలుపు చర్చలు విన్నచో అరిషడ్వర్గములు దూరమగును. మాయలను తొలగించి నా కళ్ళు నీ దివ్యరూపమును చూడగల శక్తినిమ్ము. నా లౌకిక విషయములనుగాక నీ లీలలను వినునట్లు చేయుము. జాగృతి, స్వప్నము, సుషుప్తి మోక్షము అను చతురవస్థలయందును నీ నిత్య సత్య తత్త్వము తలుపవలెను. ఎల్లప్పుడు నాలో నివసించి నన్ను మమైక్యము చేసుకొని రక్షించు తండ్రీ.

గంధమద్దిదమన్న గగనాన నీవాయె
పుడమి తత్త్వంబెట్లు పొసగ గలదు
పూల పూజలు చేసి పులకించుదామన్న
ఆకాశ తత్త్వమట్లందవాయె
అగరు ధూపమ్ముల నందించ లేనయ్య
వాసనా సంపత్తి పంపగలను
దినమణి నీముందు దీపమ్ము లేపాటి
ఆర్ద్ర తేజముతోడ నాదరింతు

ఆత్మనర్పించు వైనమే ఆరగింపు
సమయ ద్వంద్వమ్ములది పూజ సకల విధుల
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 58

ఓ భాస్కరా! నీకు గంధమునర్పించి సేవ చేయుటకు నీవు ఆకాశములో ఉన్నావు. ఈ భూతత్త్వమును నేనెట్లందించగలను. పూలతో పూజలు చేయుటకు ఆకాశ గామివి గాన అందుకో లేను. అగరు ధూపము సమర్పించు శక్తిలేదు కానీ నా పూర్వ జన్మ వాసనలు అర్పించగలను. నీవే ప్రపంచమునకు వెలుగునిచ్చు దినమణివి నేను దర్శింపజేయు దీపములు నీముందు ఏపాటివి? నిన్ను చేరుకోవలెనను కోరికతో ఆరాధించుచున్నాను. నా ఆత్మ నీకు సమర్పించుచున్నాను. ఆరగించు. గంధ పుష్ప ధూప దీప నైవేద్యముల తో కూడిన నా యీ పూజను స్వీకరించి రక్షించు స్వామి.

అస్తి నాస్తి యనుచు ననుమానములు ముందు
వివరమరయుచుందు వెతలు పడుచు
గుణములాపాదింతు గుణరహితుడవందు
గుడుగుడు గుంజంపు గోల లోన
శకలమ్ము నీవందు సకలమ్ము నీవందు
బహు భూషలందున్న పసిడి పగిది
అన్ని నీవేయందు అంతట నీ వందు
చూపుల చూచెడి చూడ్కి గలుగ

చర్మ చక్షువుకందని మర్మమెఱుఁగ
నీవె చాక్షుష్మతీ విద్య నేర్ప వలెను
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 59

ఓ వరేణ్యా! దేవుడున్నాడు లేడు అను అనుమానములతో వివరములు తెలిసుకొనుటకు ఎన్నో ప్రయాసలు పడుచున్నాను. నిర్గుణుడవైన నీయందు గుణరూపములను ఆపాదించి సత్తు అసత్తు అను గుణములను తెలియక గిరగిరా తిరుగుచున్నాను. ఓ పరమాత్మా నేను నీలోని అణు భాగమును. సకల చరాచర జగత్తు నీవు. ఆభరణములనేకమున్నను బంగారమొక్కటే కదా. చూడ గలిగినచో అన్నిటి యందు నిన్ను చూడగలుగుదుము. నా కళ్ళకు అవగతము కాని యీ రహస్యమును తెలిపి నిజమైన బ్రహ్మవిద్యను ప్రసాదింపుము తండ్రీ.

కర్జూర కాయను, కాకున్న లేకున్న
పోక చెక్కలు గాని, పూలు గాని
పసుపు కొమ్మును గాని పండునైనను గాని
అదియు కాకున్నచో నక్షతలను
బుద్ధి పుట్టిన దాని పాల్వార చేకొని
ఆకునందుననుంచి యర్చ చేయ
వస్తు గుణము పోవు వచ్చి చేరెదవీవె
అద్వైతమునకిదే ఆది బోధ

భళిర పర్జన్య గర్జయు పారిపోవు
చేత శబ్దము కన్నను శ్రేష్టమందు
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 60

ఓ భక్తవరదా! కర్జురము, పోక చెక్క, పూలు, పసుపు కొమ్ము పండు. అవి లేకున్న అక్షతలుగాని నీవు అన్న భావన తో ఆకుపై పెట్టి పూజించిన అది నీ పరబ్రహ్మమగును. నీ రూపము దాల్చును. చరాచర జగత్తులో సమస్తము నీవే అనుటకు ఇదే ఉదాహరణ. భక్తి, మనఃసంకల్పములే శ్రేష్టములు .

కుక్క జూడ భయము కోతి జూడ భయము
　　　　పదియావులెదురైన భయము భయము
జలము చూడ భయము, జనులచూడఁగ భయం
　　　　బొంటిగా గుంపుగా నుండ భయము
చీకటన్న భయము, సీమ దాట భయము
　　　　భయములిన్ని కలిగి బ్రతుకు వేళ
నద్వైతినన్నచో నాత్మ వంచన యౌను
　　　　బలముగాదది వట్టి వాపు గాని

మాయ నన్నావరించగ మసలు చుంటి
మాయ జీల్చి యభయమిచ్చి సాయ పడవె
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 61

ఓ తిగ్మకిరణ! కుక్కను కోతిని ఆవును దేనిని చూసినను భయము కలుగును. నీటిని చూసిన జనవాటిని చూసిన భయము. ఒంటరిగా వున్న నలుగురిలో వున్న, చీకటిలోనున్న, ఊరు దాటవలెనన్న భయము. ఇన్ని భయములున్న నేను నీవు నేను ఒకటే అను జ్ఞానము ఉన్నది అనుకొనుట ఆత్మ వంచన. ఇది వాపుయేగాని బలము కాదు. నన్నావరించిన మాయా విషయములను తొలగించి ధైర్యమునిచ్చి సన్మార్గములో పోవుటకు సహాయపడుము తండ్రీ.

సకల ప్రాణులు చేయు సర్వ యజ్ఞాదుల
సర్వ కర్మల యొక్క సార రూప
నీవె యాధారమ్ము నిఖిల జీవులకును
నీవు లేకను జీవి నిలువ లేదు
వస్వాదులకు మధు పాన చిత్తమటుల
యజ్ఞ ఫలమునందు యనిమిషులటు
నా బోంట్లు బహువిధానందమనుభవించి
క్రమ ముక్తి బొందంగ శ్రమను పడక

మధులిహమ్మునై మధుపాన మత్తు పోలి
భావ చిత్తాన చరియించు వరము నిమ్ము
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 62

ఓ భక్తవరద! నీవు ఈ ప్రపంచమున జరుగు అన్ని క్రియలకు ఆధారభూతుడవు, మూల కారకుడవు. జీవులన్నీ నీపై ఆధారపడి జీవించుచున్నవి. యజ్ఞఫలము పొంది తృప్తిగా నున్న దేవతల వలె మత్తు పానీయములను సేవించిన వస్వాదులవలె నావంటివారు ప్రాపంచిక ఆనందముల మొదలు బ్రహ్మానంద స్థితివరకు క్రమముగా శ్రమ పడక ముక్తిపొందునట్లు వరమునిమ్ము. తుమ్మెదలు తేనెను ఆస్వాదించుటకు ఏకచిత్తులై పరిభ్రమించునట్లుగా నా మనసు నిత్యము నిన్ను ధ్యానము చేయు వరము ప్రసాదించు తండ్రీ.

**ఊహకందని వాని నూహించ సాధ్యమే**
**చిత్తాన నిన్నెట్లు చింత జేతు**
**కర్ణపేయముగాను వర్ణించుదామంటె**
**చూపుకందదు నీదు రూపు రేఖ**
**కాలుసేతులు పట్టి కాపాడుమనుటకు**
**అంగంబులేలేక నంకవాయె**
**నిన్ను నా స్వామిగా నెన్నుకొంటిని గాని**
**సేవించుట మటుకు చేతకాదు**

**చేత గాని వానిని నీవె చేదుకొనుము**
**ధ్వాంత మాసాంతమణగంగ స్వాంత పరచి**
**భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద**
**దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ** **63**

ఓ తిగ్మకిరణ! రూపమును ఉహించుకుని ధ్యానము చేయ సంకల్పించిన, నీ రూపు ఊహకందుట లేదు. వీనులవిందుగా నీరూపు వర్ణించుటకు శబ్దములు కరువాయెను. నీ పాదపద్మములను పట్టుకుని కాపాడు రక్షించు అని వేడుకొనుటకు నీవు నా చేతికి చిక్కవు. నీవే నా ప్రభువని తలంచుచున్నాను. కానీ నిన్ను సేవించు ఉపాయము తోచక పరితపించుచున్నాను. నీ నిర్గుణ నిరాకార తత్త్వము బోధించి నా హృదయములోని అజ్ఞానము తొలగించి నా మనసును శుద్ధపరచుము.

జపతపమ్ముల జేతు జాగరూకతనుందు
సాధనా సంపత్తి సడలనీక
షడ్రిపు సంఘమ్ము సడికూడ వినబోను
సద్వృత్తి చరియింతు సాక్షి వీవు
ఒరులు నాదరిజేరి యొక్కింత పొగడంగ
మరల వినగ కోరు మనసు పుట్టు
శక్తిహీనుడనిట్టి సాత్వికాహంకార
ధాటి తాళగలేను దయను గనవె

ధాన్య రాశిలో దాగిన దర్భ వోలె
హాని కాకున్ననయ్యది అడ్డు కాదె
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 64

ఓ భక్త వరద! నియమాలతో సాధనతో జపతపములు చేయుచున్నాను. సద్గుణములతో కామ క్రోధాది శత్రువులను దూరము చేయుచున్నాను. వాటి ధ్వని కూడా మనసులో కూడా మెదలకుండా జాగ్రత్త పడుచున్నాను. కానీ ఇతరులు చేసెడి పొగడ్తలను మరల మరల వినాలనే మనసు పుడుతోంది. ఇది సాత్వికాహంకారమైనను విస్మరించరానిది. నేను నీవు ఒక్కటే అన్న చింత ఉన్నచో పొగడ్తలకు పొంగను. ధాన్యములో దర్భ పుల్ల వల్ల చెడు లేకపోయినను దానిని తొలగించవలెను కదా. కావున స్వామీ! ఈ సాత్వికాహంకారమును తొలగించి నిశ్చలుడను చేసి నా సాధనను పరాకాష్టకు చేర్చుము తండ్రీ.

మరల మరల పుట్టి మరునాడుగా నేడు
జనన మరణ రూప చక్రమటుల
నలుసంతగా పుట్టి తొలి యున్కి చూపెట్టి
నేర్పుగా వర్ధిల్లి మార్పు చెంది
దశ దశల్ దాటుచు తాను క్షీణించుచు
సమసిపోవుననెడి భ్రమలు తొలగ
భూ మాత గర్భాది భూగర్భ పర్యంత
చలనమందున నీవచలుడవౌచు

మార్పులన్నింటి కావల మారనట్టి
నిన్నెటిగిన చాలందును నిత్య సత్య
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 65

ఓ దివసకర! జనమరణ చక్రములో తిరుగుచు ప్రతి జన్మము క్రొత్త రోజుగా తలచుచు జీవించుచున్నాను. పసిపాపలుగా పుట్టి అనుదినము మార్పుచెంది దానినే అభివృద్ధి అనుకొనుచున్నాను. బాల్యాది దశలు దాటి క్షీణించుచున్నాను. భూమిలో పుట్టి భూమిలో కలయువరకు ఈ ప్రపంచమంతయు చలించుచునే ఉన్నది. నీవు స్థిరుడవు. ఈ మార్పులన్నిటికి దూరముగా వున్న నిత్యసత్యవంతుడైన నిన్ను చేరుకొనుటకు దారి చూపుము తండ్రీ.

అంతటా నీవుండ నావాహనమ్మేమి
ఆసనమ్మెచ్చోట అర్చనేమి
యనగ నాబోంట్లకు నర్హత కల్గునే
భేషజమ్మో లేక వేషమగును
ఆత్మ తత్త్వజ్ఞులై యానంద చిత్తులై
బ్రహ్మ భావనయందు వఱలువారు
తద్భావ ఫలితమౌ తాదాత్మ్యతనుపొంది
మనసు లయముగాగ యనగ నోపు

తెలియకుండ తప్పులు చేయగలను గాని
చేతనగునట్లు నను నీవె చేదుకొమ్ము
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 66

ఓ భక్తవరద! నీవు సర్వ వ్యాపకుడవు. సర్వ భూతములలో వసించువాడవు. అట్టి నీకు ఆవాహనము ఆసనము అర్చన అని చేయుట నావంటివారు గొప్పలు పోవుటయే. నటించుటయే అగును. బ్రహ్మజ్ఞానముతో ప్రకాశించు ఆత్మ తత్త్వము తెలిసిన పరమానందమును పొందుదురు. నీ యందు మనసు లీనమై నీలో కలసిపోవుదురు. అజ్ఞానముతో తప్పులు చేసిన నన్ను క్షమించి ఆత్మజ్ఞానమును కలుగజేయుము తండ్రీ.

మౌన ముద్రను  పట్టి మాట్లాడకున్నను
పరుగులాపక పోయె పాడు మనసు
పెదవి మెదపకున్న హృదయంపు లోలోన
శబ్ద ఘోష మటుకు సాగు చుండు
తపమాచరించగా తపన కలదు గాని
తను మనములొకచో తగులవాయె
బంధింప నెంచుచు బంధింప పడుచుంటి
జ్ఞాన ఖడ్గమొకటి కానకుంటి

ఎటుల తప్పించుకొనుట నే నెఱుగ కుంటి
త్వరత రక్షింప నీకిక తప్పదయ్య
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర  వరేణ్య సవితా తిగ్మ కిరణ 67

ఓ స్వామీ! మౌన వ్రతమును చేసినను మనసు మాత్రము తన వేగమును ఆపక పరుగులిడుచున్నది. పెదవి విప్పక పోయినను మనసులో ప్రాపంచిక విషయముల ఘోష వినిపించుచున్నది. తపస్సు చేయవలెనన్న ఆత్రము కలదు. కాని శరీరము మనసు సహకరించుటలేదు. మనసు బంధించు జ్ఞానము లేక పరితపించుచున్నాను. నన్ను యీ స్థితినుండి తప్పించి వేగముగా నీ దరి చేర్చుకొనుము.

ఎప్పటి రధమది యిప్పటికింకను
వాడెదవేలనో వీడ రాదో
గుఱ్ఱమ్ములైదింటి గూర్చితి, నడిపించు
మనసనూరునివోలె, మాట నమ్ము
మేరు దండమ్మును మేటిగ నిల్పితి
చూచెడునంతలో చుట్ట వచ్చు
హృదయముంచితి నీకరదమట్లు, చాలదో
కనువిందు సల్పంగ కమలములకు

కేలు సాచి వేడెదనయ్య జాలి లేదొ
వీలు చేసుకు రావయ్య మేలు సేయ
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 68

ఓ దినకర! తొమ్మిదివేల యోజనాల పొడవైన పురాతనమైన ఏడు గుర్రాల రథాన్ని ఎక్కి విహరిస్తున్నావు. పంచభూతములు జ్ఞాన కర్మేంద్రియములతో చేయబడిన ఈ శరీరము అను రధమునర్పించుచున్నాను. అనూరుని వలె అమిత వేగముగా నా మనసు నిన్ను నడిపించగలదు. నా హృదయమే నీకు ఆసనము. కమలబంధువువైన నీవు నా హృదయ కమలమును చేరి వసించుము. చేతులెత్తి వేడుకొనుచున్నాను. దయచేసి నా మనసునేలుకొనుటకు దరిచేరు స్వామి.

**కాంతిని కాంచగా కాంతారమునజొచ్చి**
**చీకటేమిటనుచు చిందులేల**
**దప్పిదీర్చుకొనంగ నుప్పు సంద్రపు నీరు**
**త్రావనేగుట తన తప్పు గాదె**
**వైరాగ్య మాశించి పేరాశ పరుగుల**
**విషయసంచయమేల విసుగు లేక**
**రమ్మన కున్నను నిమ్ముగ గాలాన**
**పోయి జిక్కిన చేప వోలె లేదొ**

**పొంద నెంచిన దొకటైన పొందునొకటి**
**పొంద నిన్నెట్లొ తెలుపుము కుందనీక**
**భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద**
**దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ** **69**

ఓ దినకర! అడవిలో జొచ్చి కాంతిని వెతికినను, దప్పి తీర్చుకొనుటకు సముద్రమునకేగినను నిష్ఫలమే యగును. అట్లే వైరాగ్యము పొందకోరి విషయవాంఛలందు పేరాశతో పరుగులు తీసిన నిష్ఫలమే యగును. తనంత తానుగా గాలములో చిక్కిన చేపవలె ప్రమాదము సంభవించును. కావున ఓ స్వామి, కాంతిని పెంచి నిన్ను చేరుకొను మార్గము తెలుపుము.

కట్టు బొట్టును బట్టి పుట్టు చోటును బట్టి
కులమతమ్ముల పేర కొట్టు కొంద్రు
మతము మదిని పుట్టు, మనకు నచ్చగ బొట్టు
కోరి మేమొక రీతి కూడ కులము
మనషి పుట్టక యున్న మనసెట్లు పుట్టేను
మనసుకునికి లేదు మనిషి లేక
అట్టిదానిని పట్టి కొట్టుకొనుటయేల
పట్టనీ పాదమ్ము పాడి కాదె

మనసు మాయకు చిక్కక మసలు కొనుచు
మలిన రహితమౌ భక్తిని మాకు నిమ్ము
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 70

ఓ దేవా! కట్టు బొట్టు కులము మతము ప్రదేశము అను భేదములతో ప్రజలు వైరముతో జీవించుచున్నారు. మతము మనసున పుట్టి మార్గమును చూపును. చక్కదనములకు బొట్టు పెట్టుకొందురు జీవన విధానమును బట్టి కులము కలుగును. మనిషే లేనిచో మనసుకు మనుగడ లేదు కదా. శాశ్వతమైన నీ పాదములను వదలి ఈ భేదములతో విభేదించుట అజ్ఞానము. దానిని తొలగించి పవిత్రమైన భక్తి మనసునందు కలుగునట్లు చేయుము తండ్రీ.

నా చిన్ని చేతిని నా గుండెకానించి
నా పేరు పల్కుచు నన్ను జూపి
నా చిన్ని నోటితో నా పేరు చెప్పించి
తెలివి కలదు గాన తెలిసెననిరి
సోహమ్మని మరచి దేహభానము నేర్పి
అదియె తెలివనుచు నందురేల
నామ రూప జగతి నశ్వరమ్మని చెప్పు
విజ్ఞానమివ్వరే విశద పరచి

మోహమదియెంత గొప్పది మోసకారి
నిజము తెలియగ నీయందు నిశ్చయముగ
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర  వరేణ్య సవితా తిగ్మ కిరణ 71

ఓ తిగ్మ కిరణ! పసిపిల్లల చేతులు పట్టుకుని లాలించి నీవెవరు నేనెవరు అని ప్రశ్నించి పేర్లను చెప్పించెదరు.  అది విని చాలా తెలివిగలవాడని పొగిడి ముద్దు చేయుదురు.  నీవే నేను నేనే నీవు అను సోహం భావమును మరచి దేహభావమును నేర్పెదరు.  మోహము పెద్ద మోసకారి.  సత్యమును తెలియనీయదు. నామము రూపము కల ఈ జగత్తు శాశ్వతము కాదు. నీవు శాశ్వతుడవన్న జ్ఞానము కలిగించు స్వామి.

ఒక్క పాపంబునకొక్క పుణ్యంబని
చెల్లు వేసుకొనంగ చెల్ల బోదు
ఏది పాపంబగు నెయ్యది పుణ్యమో
ధర్మ మరసి జూడ తనకు తెలియు
ధర్మమేమిటగును ధర్మ సూక్ష్మంబేది
దరిగొన దగునేది తగని దేది
ఈ రీతి విచికిత్స నేటికి కుందుట
తెలిపెడి వారేరి తేట పరచి

మరల జన్మమ్ము రాకుండ మసలు కొనగ
చ్యుతిని గానీక రక్షించు ద్యుతివి నీవు
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 72

ఓ సవితా! ఒక పాపము చేసి ఒక పుణ్యము చేసి లెక్క సరియైనది అనుకొనుట అజ్ఞానము. పాప పుణ్యముల భేదము తెలిసికొను ధర్మ సూక్ష్మమును ఉచితానుచిత భేద భావమును కనుగొనుటకు పరితపించుట వ్యర్థము. శాశ్వతమైన జన్మ రాహిత్యమును పొందు మార్గమును తెలిపి మమ్ము కావుము తండ్రీ.

పుట్టిన తోడనే పొట్ట నింపుకొనంగ
పాలకై స్తన్యంబు పట్టుకొంటి
ఎదిగెడి వయసున నెదలోన మెచ్చిన
బంధు మిత్రుల చేయి పట్టుకొంటి
వంశ వృద్ధికనుచు పాణిగ్రహణమంచు
భళిర సంసారము పట్టుకొంటి
వయసు మీద పడెను వదలుటెట్లంచును
గట్టిగా నావారిఁ బట్టుకొంటి

పట్టినది నేను నన్నది పట్టెనందు
పట్టు సడలించి నీ చేయి పట్ట నిమ్ము
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 73

ఓ భాస్కరా! పుట్టిన వెంటనే ఆకలి తీర్చుకొనుటకు పాలకై తల్లిని పట్టుకుంటిని. అటుపై నచ్చిన హితులను బంధువులను పట్టుకుని జీవన యాత్ర సాగించినాను. వంశవృద్ధి కొరకు సంసారమును పట్టుకున్నాను. వయసుపై బడి బ్రతుకు నీడ్చుటకు నా వారినందరిని పట్టుకున్నాను. ఇహలోక మాయతో అన్నిటిని పట్టుకున్నది నేను కాని అవియే నాకు ప్రాప్తమైనవని భావించుచున్నాను. బంధువులు స్నేహితులు అను బంధములనుండి నన్ను విడిపించి నీ దరికి నన్ను చేర్చుకొనుము తండ్రీ

పరులకు బోధించు వచనాలు దొడ్డవై

వ్యాసునకించుక తీసిపోవు

తానాచరించక తప్పించు కొనుటకు

ఎల్లెడ సాకులు కొల్లలుండు

పేరు తెలిసినంత పెద్ద పండితుడట్లు

గ్రంథ వ్యాఖ్య సేయు ఘనత గలదు

కనపడు ప్రతివాడు తన శిష్యుడేయంచు

గొప్పలు చెప్పంగ కొరత లేదు

అయ్య నేనిట్టివారల నియ్యకొనక
సత్య మార్గాన నడిపించు నిత్య వర్తి
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 74

ఓ దేవా! ఎదుటివారికి నీతులు బోధించునపుడు కొందరు వ్యాస మహర్షిని మించిపోవుదురు. ఆచరణ యందు మాత్రము ఎన్నో సాకులు చూపించెదరు. గ్రంథము పేరు తెలిసినంతనే వ్యాఖ్యానము చేయు పండితులవలె గొప్పలు పోదురు. అందరు తన శిష్యులే యని తానే జ్ఞాన బోధ చేయుదునని వాపోవుదురు. ఓ స్వామీ నన్ను ఇట్టివారి వద్దకు చేరనీయక సత్య మార్గములో సాధన చేయు విధము తెలిపి నన్ను నడిపించుము.

ఇందునగాక వేరెందుండెదవనుచు
కుజనులు కొండొక భజన పరులు
బుధజన వచనాలు బుద్ధినంటగనీక
గురుతర సత్యమ్ము నెఱుఁగలేక
శుక్ర శోణిత రూపు శుద్ధ తత్త్వంబను
మంద బుద్ధి నొకచో మార్చు కొనక
అపసవ్య చారులై విపరీత మార్గాల
సంచరించెడి వేళ సాయ పడవొ

గ్రహగతులు దాటి నిజ తత్త్వ గమనమెఱిఁగి
నిన్ను జేరగ దిక్కన నీవె గాదె
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర  వరేణ్య సవితా తిగ్మ కిరణ 75

ఓ దివసకరా! లోకమందు గురువుల మాటలను బుద్ధియందు నిలుపక సత్యమును గ్రహించలేక మాంస రక్తమయమైన ఈ శరీరమే నిజమని భ్రమ గలిగి, బుద్ధిని వికాసపరచుకొనలేక తిరోగమన దిశలో జీవన యానము సాగించుచున్నాను.  అట్టినాకు గ్రహగతులకతీతమైన నిజ తత్త్వమును తెలిపి నిన్ను చేరుకొను మార్గమును ప్రసాదింపుము. నాకు నీవే దిక్కు.

విశేషాంశము: పద్య పాదములు చంద్రాది రాహుకేతు పర్యంతం అన్ని గ్రహాలను స్మరించబడినది.

**నది బుట్టు తావున నలుసంత మాత్రమై**
**పల్లమెఱిఁగి తాను పారు వేళ**
**వర్ష జలము తోడ వాగు వంకల తోడ**
**ఉపనదులును కల్గు నునికి లాగు**
**నిర్గుణాత్మకుడైన నీకు రంగుల నద్ది**
**రూపరహితునకు రూపులిచ్చి**
**తత్త్వజ్ఞులితరులున్ తమ భావ బలిమితో**
**భిన్నరూపాలతో నిన్ను కొలువ**

**ఎఱుఁగ జగదేక పూజ్యుడవీవనంగ**
**మూల తత్త్వమ్మునెఱిఁగించు మేలు గలుగ**
**భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద**
**దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ** **76**

ఓ భక్త వరదా! నది చిన్న చారలా పుట్టి పల్లమెరిగి వర్ష ధారలను ఉపనదులను కలుపుకొని పెద్దదై ప్రవహించును. గుణరహితుడవైన నీకు రంగు రూపు ఆపాదించి తత్త్వము తెలిసినవారు తెలియనివారు కూడా తమ భావ బలముతో నిన్ను కొలుచుచున్నారు. నీవు ఏక రూపుడవని తెలియక తల్లడిల్లుచున్నాను. జగదేకపూజ్యుడవైన నీవు నీ మూలతత్త్వమును తెలిపి నాకు జ్ఞానమును ప్రసాదించుము తండ్రీ.

నీనుండి పుట్టితి నీలాగు లేనేల
యను శంక తొలగంగ నరిగినట్టి
ఉప్పు బొమ్మొకటి తా నుదధిలోనురుకంగ
నునికి సమసి పోయె నొక్కటాయె
తోడుండ పెరుగును వేడంగ దరిజేరి
తోటి పాలను తన బోటి జేయు
నిను పట్టుకొనుటకు తనువచ్చి చేరినా
తనను పట్టగ నీవె తరలి యైన

ఎవరి కడకెవ్వరేగిన నేమిటంట
కడకు చూడ నద్వయ సిద్ధి కలుగునంట
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర  వరేణ్య సవితా తిగ్మ కిరణ 77

ఓ సవితా! ఉప్పు సముద్రమున పుట్టి బొమ్మవలె మారి సముద్రమువలె తాను లేనే అనుకొని తిరిగి సముద్రములో కలసిన అందునొక బిందువై సమసిపోవును. పాలు తోడుగా ఉండమని పెరుగును కోరగా పెరుగు పాలకు తన రూపును ఇచ్చి తనలో ఐక్యము చేసికొనును. నిన్ను చేరుటకు నేను వచ్చినను, నన్ను చేర్చుకొనుటకు నీవు తలచినను, నీవు నేను అను భేదము లేదుకదా. పరమాత్మవైన నీలో నన్నుకలిపి మమైక్యము చేసుకొనుము తండ్రీ.

**మత్పురాకృత పుణ్య మాహాత్మ్య పరిపాక**
**ఫలితమాకారమ్ము బడసినట్లు**
**సత్కృపా రస ధార సానుకంపంబుతో**
**చెలగి విస్తారమ్ము చెందినట్లు**
**హృత్సరోజ వికాస మెదనిండ కన్పట్ట**
**శుభద శ్రీకారమ్ము చుట్టినట్లు**
**తత్సుధా జలధిలో తాదాత్మ్యమొంది నా**
**యునికి సాకారమ్ము నొంద గాను**

**చింతలుడుగంగ నీపైన చింతనొకటె**
**వెంట నీవుండ వెతలు నా వెంట పడునె**
**భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద**
**దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ** **78**

ఓ భక్తవరద! పూర్వజన్మల పుణ్యఫలము వలన ఈ జన్మ పొందినాను. నీ దయా రసము వలన సాధనా సంపత్తి తో అభివృద్ధి చెందుచున్నాను. మనో కమలము వికసించి జ్ఞానము లభించి అమృతత్త్వము పొందుటకు ప్రయత్నించుచున్నాను. నీ యందు నా ఆత్మ సమసిన ఈ జీవితము సార్థకతను పొందును. అట్టినా కోరికను మన్నించి భవభయములను తొలగించి నీ దరి చేర్చుకొనుము.

రాగి చెంబెడు నీట రక్త చందనముంచి
ఎర్ర గన్నేరులనెంచి యుంచి
దూర్వాంకురములుంచి తోడునక్షతలుంచి
కుదురుగా చేపట్టి నుదురుకాన్చి
మోకాళ్ళ పై నిల్చి ముదమార నిను తల్చి
హంసాది నామాల నర్ఘ్యమీయ
దారిద్ర్య దుఃఖాలు దరిదాపులకు రావు
వాని జేరగలేవు వ్యాధులసలు

నీటితో పూజ మెచ్చి కన్నీటినంత
చేత తుడిచెడి నిను గొల్తు చేతులెత్తి
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 79

ఓ సవితా! రాగి చెంబులో నీరు పోసి రక్త చందనము కలిపి ఆనీటిలో ఎర్ర గన్నేరు పూలను గరికపోచలను అక్షతలను వేసి ఆ చెంబును నుదుటికానించి మోకాళ్ళపై నిలబడి మనసారా నిను తలచుచు హంసాది డెబ్బది నామములతో అర్ఘ్యమునిచ్చిన వారికి దీర్ఘ రోగములు దారిద్ర్యదుఃఖములు తొలగిపోవును. నీటితో పూజించగానే మా మురికి కన్నీటిని తుడచు కరుణామయుడవైన నీవు నన్ను కాపాడుము.

సౌషుమ్న కిరణమ్ము చంద్రుని కందించి
సంపద్వసువును భూజాతునకును
విశ్వకర్మ బుధుని వీర్యమై వెలయించి
దేవ గురునికి యుదావసువిడి
విశ్వవ్యచస్తేజ విస్తారము కవికి
శనికి సురాట్తేజ శక్తినిచ్చి
నక్షత్ర క్షాత్రమై నడయాడు తేజమ్ము
హరికేశ నామక కిరణమిచ్చి

సకల దీప్తుల దీపించు శక్తివీవు
విశ్వ గమనమ్ము గమనించు విశ్వరూప
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 80

ఓ స్వామీ! నీవు నీ అనేక కిరణములలో చంద్ర, కుజ, బుధ, గురు,శుక్ర శనులకు నక్షత్ర గణమునకు ప్రతేకమైన కిరణ సంపదనిచ్చి వారి తేజమునకు కారణమైనావు. ప్రపంచ గమనమును శాసించువాడవు. అన్ని ప్రకాశములకు మూల కారకుడవు. నా యందు జ్ఞానప్రకాశమును గావించి నీ దరి చేర్చుకొనుము స్వామీ.

జగతినుద్దీపించి జనుల మేల్కొలిపించు
పద్మినీ శక్తి నీ పట్ట మహిషి
వారించ రోగాల ప్రాభాత శక్తియే
ఉషయన్న పేరుతో నునికి కలిగె
ఏది యెయ్యది యన్న నెఱుక గల్గించు
శక్తికిచ్చిన పేరు సంజ్ఞ యనుచు
నీ వెల్గు వెంబడి నీడయై నిల్చుండు
శక్తి బిల్తుము మేము ఛాయ యనుచు

వారి నీ భార్యలనుచు ముద్దార పిలువ
మాతృమూర్తులౌదురు తండ్రి మాకు వారు
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 81

ఓ భక్తవరద! ఈ ప్రపంచమునకు చేతనము కలిగించు పద్మినీ మాత మమ్ము మేల్కొల్పును. ఉషాదేవి తన ప్రాతఃకిరణములతో రోగాలను బాపును. సంజ్ఞాదేవి వివేకము జ్ఞానము కలుగజేయును. ఎల్లవేళలా నా వెంటనే యుండి రక్షించునది ఛాయాదేవి. వారు నలుగురు మాకు మాతలు. ఈ దీనునైన మీ పుత్రుని లాలించి దరిజేర్చుకొని కాపాడుము.

**సారఘసార కాసార కాంతారాది**
**సంచార వేళలన్ సారము గొని**
**పూల పుప్పొడులన్న జోలికింబోక యా**
**కాంక్షిత లక్ష్యమౌ గమనమట్లు**
**సదసద్వివేకమ్ము సర్వాత్మ భావమ్ము**
**సద్గురు ధ్యానమ్ము సకలమగుచు**
**దేహభానమ్ము సందేహతప్త మనమ్ము**
**సంసార దుఃఖాది సడిని గనక**

**నీదు పాద పద్మాలపై నిశ్చలముగ**
**వ్రాలి ననుముక్తి మధువును గ్రోలనిమ్ము**
**భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద**
**దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ** **82**

ఓ దేవా! తుమ్మెద పూలపైనున్న పుప్పొడులనాశించదు. సరస్సులలోను కానలలోను తిరిగి తిరిగి తేనెను ఆస్వాదించుటకు వెతలు పడును. అట్లే దేహముపై మమకారమును మనసులోగల అనుమానములను సంసార బాధలను వదలి నిత్యము అనిత్యము అను భేదము గ్రహించి సద్గురు ధ్యానమే సర్వస్వమనుకుని, నీ పాద పద్మములపై ధ్యానము నిల్పి నన్ను ముక్తి అను మధురసమును సేవించునట్లు చేయుము తండ్రీ.

**కాపాడమన్నచో కష్టమిచ్చెదవేమి**
**కరుణ లేదేమంచు కలక కలుగు**
**సుఖము గల్గిన వేళ సుఖములాగనియట్లు**
**వరములీయగ నిన్ను వదలరసలు**
**సుఖదుఃఖ ప్రారబ్ధ శూన్యమగునటుల**
**అనుభవించుట గొప్ప యవసరమ్ము**
**వలయు, వలదనుచు వాంఛలున్నపుడెట్లు**
**వాంఛితమ్మగు ముక్తి బడయనగును**

**అనుభవించెదనంతయునమిత భక్తి**
**నౌదలందాల్తు నీ యాజ్ఞననవరతము**
**భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద**
**దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ** **83**

ఓ భక్త వరద! రక్షించుమని ప్రార్థించినను కష్టములు కలిగినచో నీకు కరుణ లేదని కినుక వహించెదము. వరములు ప్రసాదించకుండా నిన్ను వదలలేను. సుఖ దుఃఖములకు పూర్వ జన్మ కర్మ ఫలమే అనుకొనుట ఉత్తమము. ఐహిక సుఖములు పొందవలెనని దుఃఖములు తొలగవలెనని భావించు మావంటివారికి ముక్తి ఎట్లు లభించును. శుభాశుభ పరిణామములు, నీ ఆదేశముగా భావించి రెంటిని సమానముగా చూచి, ఎట్టి స్థితిలోను నీపై భక్తిని వీడని మనసు ప్రసాదించుము తండ్రీ.

వంకలనెంచ నా వంకజూచుచు దోష
పంక్తినుటంకించు పండితులను
మాటల నేపాటి పాటి సేయకయుందు
నీవు నా యంతట నిండియుండ
రసమయ మన్మధ రాజ శరాసన
మ్ము మెలికల్ దిరిగియు మేలగు రుచి
గోలుపోవని రీతి కూర్మినణువణువీ
వేయుండ వంకలకేల వెరపు

నీవు కట్టిన యింటను నీవు నిలువ
వేరు పిలుపు గావలెనేమి వేగ రార
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 84

ఓ భక్తవరద! నాలో దోషములు కలవని, శరీరాకృతి అంద వికారమైనదని, ఎంతటివారన్ననూ నేను లెక్క చేయను. నీవు నాలో అణువణువు నిండియుండగా దోషములను గూర్చి చింతించుట అజ్ఞానము. చెరకు వంకర తిరిగినను, కణుపులు వున్నను తీయటి రసమునే ఇచ్చును. నీవు నిర్మించిన ఈ శరీరము అను నివాసమునకు నీవు చేరి శాశ్వతముగా నివసించి నన్నేలుకొనుము.

నేను నేనను నేను నేనని నేననన్
నేనన్న నేనన్న నిన్ను నిన్నె
నా మనమన్న నీ నామమ్మనిన్ నమ్ము
నీ నామ మననమ్ము నెమ్మి నిమ్ము
సుమ సమానము మానసమనుమానము మాని
నా మనో సుమమాసన మనుమన్న
నీ యెద దాగని నీ దయ నేగొందు
నాదగు నయ్యది నాదెయందు

వేనవేల మాటలవేల వేడికొందు
నెల్ల వేళల నుండు నా యుల్లమందు
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 85

ఓ దినకరా! నేను నేను అనగా అది నీవే. నామనసంతటా నీవే. నిరంతర నీ నామస్మరణ చేయు భాగ్యమ్మునిమ్ము. పూవు వంటి నా మనసునందు అనునిత్యము వసింపుము. మనసులోని దాచుకోలేనంత దయను నాపై చల్లి కాపాడుము. వేల మాటలెందుకు ఎల్లవేళలా నా మనసునందు వుండి రక్షించు తండ్రీ.

నేనొక దాసుడ నీవు దైవంబని
రక్షణా దక్షుని రవిని తలచి
నీ చేత కల్పించు నీ చేతనమ్మును
నీ కొఱకర్పింతు నిందు మనము
నిను బట్టి నిజముగ నీవారు నడువరే
నీ యొక్క కరుణయే నీదు యునికి
నీ యందు మది నిల్పి నీయందు చేరగా
ఆదిత్య భాస్కర యనుచు పిలువ

ఈ విభక్తులు యుక్తులనేవి లేని
ప్రబలమాసాంతమవిభక్త భక్తి నిమ్ము
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 86

సార్వవిభక్తిక సీసము

ఓ దినకర! నీవు లోక రక్షకుడవు. నేను నీ దాసుడను. నీవిచ్చిన నీ చేతనమును మనస్సును నీకు అర్పించుచున్నాను. నీవాడనైన నేను నినుగాక ఎవరిని పట్టుకొందును. నా పై కరుణ చూపుము. ఆదిత్య భాస్కర అని స్మరించుచు నీపై మనసు నిల్పి నిన్ను చేరదలచినాను. నీవు నేను అను భేదభావములను పోగొట్టుకొని అత్యంత శక్తివంతమైన భక్తితో నిన్ను కొలచు చున్నాను నన్ను ఉద్ధరింపుము.

**గుణములగని దోష గుణమని నిందించు**
**కుత్సిత బుద్ధిని ఘోరమందు**
**దోషంబు కానట్టి శేషించు గుణముల**
**గణియింప యోచింప గారవమ్ము**
**చిన్న సుగుణమైన మిన్నగా పరికించ**
**సల్లక్షణంబందురెల్లరకును**
**గుణ దోష మీమాంస గుడుగుడు గుంచంపు**
**పోలిక యాటల గోల లేక**

**సగుణ నిర్గుణాత్మకమైన సకలమందు**
**మూల మెఱుఁగుట భవరోగమునకు మందు**
**భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద**
**దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ** **87**

ఓ భాస్కరా! కుత్సిత స్వభావులు ఇతరుల సద్గుణమ్ములందు కూడా చెడునే ఎంచెదరు. గుణదోషములన నెంచక సద్గుణములనే ఎంచుట మధ్యముల లక్షణము. ఉత్తమ లక్షణమన్నచొ ఇతరుల చిన్న సద్గుణమైనను కొండంత చేసి అభినందించుట. గుణదోష విచారము చేయుట దాగుడుమూతలాట. ప్రపంచపు మాయ. అన్ని సద్గుణములు కలిగియు నిర్గుణుడవైన నీవు నా యీ మాయను తొలగించి పరలోక జ్ఞాన ప్రాప్తికి సాయపడుము.

కన్ను ముక్కుల తీరు కమనీయమై తోచు
కదలికల్ కనిపించు కళ్ళ ముందు
బింబమ్మువలె ప్రతిబింబముండును గాని
అద్దమందలి ఛాయ లసలు కాదు
కదలాడు జగమంత కాదటో నీ ఛాయ
అవ్యక్త మాహాత్మ్య మరసి చూడ
జడమనంగను చెల్లు చైతన్యమనరాదు
కార్య కారణ గతి కనుగొనంగ

సర్వ చైతన్య కారణ శక్తి వనుచు
నిన్నెఱిఁగి నేను తరియించ నిన్నె గొలుతు
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 88

ఓ భాస్కరా! అద్దమందు మన కన్ను ముక్కుతీరు అందముగా కనిపించును కాని అది ప్రతిబింబమే కాని సత్యము కాదు. జరుగుచున్న కార్యము దానికి గల కారణము ఈ రెంటి సంబంధములను పరిశీలించినచో ప్రపంచమంతయూ నీ ఛాయయే. కంటికి కనపడని అసలు రూపు కనుగొనినచో ఈ ప్రపంచమంతయూ జడము జీవము లేనిది అను సత్యము తెలియును. ఇహలోకపు చైతన్యములకు మూల కారకుడవైన నీవు మాయను తొలగించి నన్ను సత్యమార్గమున నన్ను నడిపించు తండ్రీ.

నామాక్షరమ్మైన నాల్కపై నిల్చినా
చవులు పుట్టించుచూ చెవిని పడిన
కరిగి నీరైపోయి కనిపించనంతగా
కళ్ళ వెంబడి నీరు కారనిమ్ము
అణువణువున కణకణమున నానంద
ముప్పొంగ నా యొంటి నొణకనిమ్ము
కోర్కెల పుట్టగు కొంటె మనసునంత
నీవాక్రమించుచు నిండిపొమ్ము

చేరనెంచ నీకడకది జీవితమ్ము
నేననునది లేనంతగా నీవె కమ్ము
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 89

ఓ భక్త వరద! నా జ్ఞానేంద్రియములన్నింటిని నీకొరకై పరితపించి పరవశించి పరిష్వంగ సుఖము పొందనిమ్ము. నీ నామ స్మరణ నాల్కపై ఎల్లవేళలా కదలనిమ్ము. నీనామ శ్రవణముచే చెవులను పరవశించనిమ్ము. ఆ యానందములో కళ్ళయందు ఆనంద భాష్పములు రాలి తాదాత్మ్యమును పొందనిమ్ము. శరీరమంతయూ అణువణువున ఆనందముతో పరవశించనిమ్ము. నా మనసునంతటను నీ భక్తి భావము నిండనిమ్ము. నేను అనునది నీలో తాదాత్మ్యము కానిమ్ము తండ్రీ.

ఉద్యోగమను పేర నూరొందిలి కొడుకు
అత్తింటిలోనుండి యాడపిల్ల
పెరవానిగా చూచు పిల్లనిచ్చినవారు
కష్టాల వినలేని కన్నవారు
కలిగి కలగకున్న కలహాన జ్ఞాతులు
ఏమి లాభమ్మంచు నితర జనులు
ఈ జన్మ బంధమ్ములీవిధమ్ముగనుండ
గతజన్మ వివరాల గణనలేల

వెరసి ననుగాచువాడవు వెదకి చూడ
సర్వగతుడవనాద్యంత సాక్షి వీవె
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 90

ఓ దేవా! ఉద్యోగ నిమిత్తమై కొడుకులు, అత్తవారింటికి వెళ్ళి ఆడపిల్లలు, బయటవానిగా చూచు అత్తింటివారు, ఆస్తి కలహాలతో దాయాదులు నిరుపయోగమని ఇతరులు దూరమగుచున్నారు. ఈ జన్మ బంధములీవిధముగా నున్నప్పుడు పూర్వ జన్మ బంధములను లెక్కించి చేయగలదేమున్నది. అంతటను వ్యాపించిన ఆద్యంతములకు సాక్షివైన నీవే నాకు దిక్కు. నన్ను ఈ బాధలనుండి రక్షించు స్వామి.

కులము కులమని వ్యాకులమందనేలనో
కలహ కారణమైన కులమదేల
మతము మతమని సమ్మతి కోరనేలనో
మమత నింపకయున్న మతమదేల
భూత పంచక జడభూత దేహమునందు
నే భూతమేకులమెట్లు తెలియు
చైతన్యమన్నింట చేరి నీవై యుండ
కులమతమ్ముల తీరు కొలుచుటెట్లు

నామ రూపాల రంగుల నటన దాటి
శుద్ధ చైతన్య తేజమ్ము చూపవయ్య
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 91

ఓ సూర్య దేవా! కలహములకు కారణమైన కులము అను భావన బాధలు కలిగించును. సాటి మానవులపై మమతలేని మతము వ్యర్ధము. కులమతములు లేని పంచభూత నిర్మితమైన ఈ శరీరమునకు కులము మతములు లేవు. ప్రపంచము నీ చైతన్యముతో మనగలుగుచున్నది. దానికి ఏ కులమత రంగును పూయలేము. నామము రూపు రంగు అను యీ మాయను దాటి శుద్ధ చైతన్యమును మాలో నింపగల జ్ఞానమును ప్రసాదింపుము తండ్రీ.

బహిరంతరింద్రియ వశవర్తినౌచును
శాస్త్రాల విశ్వాసశాలినగుచు
సజ్జన సేవయు శరణాగతత్త్వమ్ము
వివరమరయుటకు విసుగులేమి
సద్బుద్ధి గురుసేవ సద్వర్తనంబును
శుశ్రూష సేయుట శుభదమంచు
ఇసుమంతయు నసూయనియ్యకొనక సిగ్గు
పడకుండ గురునికి ప్రణతులిడగ

సిద్ధ పరచుము సాధనా క్షేత్రమింక
నాధ జ్ఞానాంకురమ్ముల నాటుమయ్య
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 92

ఓ తిగ్మ కిరణ! పంచ జ్ఞానేంద్రియములు కరణేంద్రియములను వశపరుచుకొని, శాస్త్రములపై విశ్వాసముంచి సజ్జనులను సేవించి శరణాగతి కలిగియుండి సద్విషయములను తెలిసుకొనవలెను. జిజ్ఞాస సద్బుద్ధి గురుసేవ సత్ప్రవర్తన కలిగియుండి జ్ఞానము పొందవలెను. అసూయ, సిగ్గు వదలి గురుపాదశరణు చేరి సాధన చేయుట ఉత్తమ లక్షణము. అట్టి స్థితిని నాకు కల్పించి నా మనసు అను క్షేత్రమున జ్ఞానము అను అంకురములు నాటి వాటిని వృద్ధి చేయుము తండ్రీ.

నేను నాదను దేహ భానమౌ భావమ్ము
బంధ హేతువటంచు వదలగొట్టి
మానావమానాల మనసునంటగనిక
శత్రుమిత్రులనక సమత నింపి
ఆత్మకు కర్తృత్వమంటగట్టగనీక
అజ్ఞాన చర్యలనదుపుజేసి
దేహమనిత్యము దేహి సత్యమనెడి
నిగమోక్త వివేక నియతి గలిగి

అమల నిశ్రేయస పథమ్మునాశ్రయించ
సర్వ శ్రేయస్కరమ్మని సన్నుతింతు
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 93

ఓ దేవదేవ! నేను నాది అను భావమును ఇహలోక బంధములు దూరము చేసి సన్మాన అవమానములను మనసునందు చేరనీయక శత్రువులను మిత్రులను సమానముగా చూడగలుగు స్థితికలిగి బుద్ధిమాలిన పనులు చేయక దేహము అశాశ్వతము భక్తియే శాశ్వతమను భావన కలుగజేసి నియమాలతో జివనము సాగునట్లు చేసి పవిత్రమైన ముక్తి మార్గమును ఆశ్రయించునట్లు చేయుము తండ్రీ.

చిక్కక బ్రహ్మమే చిక్కుచు జీవుడై
చొక్కాలనైదింట చిక్కి సొక్కి
వేషధారణ చేత వేరుగా భావించి
వేషమే నేనంచు వెతల బడుచు
తను పదార్ధమనుచు తన యథార్ధమరయ
తను విచారించగ తలపు మరచి
తాను సత్యమనియు తానె జ్ఞానమనియు
ఆనంద రూపమ్ము తానె యనియు

నిజమెఱుఁగడాయె నినుజేర నేరడాయె
మమ్ము రక్షింప మాయల మానరాదె
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 94

ఓ దినకర! జ్ఞానము నశించి జీవుడు ఇహబంధములలో చిక్కును. వెతలు పొందును. శరీరమును చూసుకొని పరమాత్మ వేరు అను భావమును పొందును. తానే సత్యమని తలచి అసలైన నిజమును మరచిపోవును. జ్ఞానము ఆనందరూపము తానేయని భావించి వెతలు పడుచున్నాడు. ఓ దేవా యీ మాయలను వదిలించి జ్ఞానము ప్రసాదించుము తండ్రీ.

ముక్కాలములయందు ముజ్జగంబులయందు
కలయాడు కళవన్న జ్ఞానమిమ్ము
నీవు నాలో నిండ నేను నీవేనన్న
స్ఫూర్తి నింపుము తండ్రి పూర్ణ గతిని
నశ్వర జగతిని శాస్వతమెయ్యది
నీ చేతనేయన్న నిజము తెలుపు
వెలుగేది గలిగిన వెలిగేను ప్రాణు లా
వెల్గునీవేనన్న వివరమిమ్ము

వేద శీర్ష శిరో వాక్య వేదినగుచు
ననుభవానందమందంగనండ నీవు
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 95

ఓ వేదవేద్యా! ఎల్లకాలములందు అన్నిలోకాలకు వెలుగునిచ్చువాడవు నీవు. నాలో నీవే నిండియున్నావు. నీవు నేను అను భేదము లేదని తెలిపి కనికరించుము. నీవు అను చేతనమొక్కటే యీ నశ్వరమైన లోకమందు శాశ్వతమని తెలియజేయుము. ప్రాణులన్నీ ఏ శక్తివెలుగులో ప్రకాశించుచున్నవో, ఆ జ్ఞానమును వేలు కలుగజేయుము. ఉపనిషద్వాక్యములను ఉపదేశించి వేగమే నన్ను నేను తెలిసుకొను స్థితి కలుగజేయుము.

పరమాత్మ నీపాద సరసీరుహమ్ముల
నెల్లవేళల కొల్వనుల్లమందు
కవచమై కాపాడు కారుణ్య మూర్తిరో
కామితమ్ములడుగు కాంక్ష లేదు
అష్టాక్షరీ ధ్యానమక్షయమ్ముగ చేయ
నజ్ఞాన తిమిరమ్ములణగి పోవు
నీవు నా తోడున్న నిముసమందే నాకు
భయము తొలగిపోవు బలము గలుగు

నీవు నేనైననో నేను నీవెయైన
అడుగ పనిలేకనమృతత్వమమరునయ్య
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 96

ఓ భక్తవరద! మనసునందు ఎల్లవేళలా నీ పాద పద్మ స్మరణ చేసిన కరుణతోడ మమ్ము కవచముగా ఎల్లవేళలా కాపాడెదవు. అష్టాక్షరీ మంత్రము యెడతెరపిలేకుండా ధ్యానించిన అజ్ఞానమను చీకటి తొలగిపోవును. నీవు నా తోడుగానున్న ఇహపరభయములు సమసిపోవును. నేను నీవు అను భేదములేకుండా పరమాత్మవైన నీయందు నేను త్రికరణశుద్ధిగా ఐక్యము చెంది అమృతత్వము పొందు వరమునిమ్ము స్వామీ.

జన్మలందున మర్త్య జన్మముత్తమమండ్రు
మంచి చెడుగుల తానెంచు గనుక
సదసద్వివేకమ్ము చలిచీమకుండును
పంచదారనిసుక నెంచు వేళ
పేడ పురుగు కన్న పెద్ద వైరాగ్యమా
కర్మ చేయుచు తాను కట్టుబడదు
పుష్పము కడకేగు భృంగంపు లక్ష్యము
మధు సంచయన వేళ మనకు తెలియు

లక్ష్య మెఱుఁగని జన్మలు లక్షలేల
లక్ష్య శుద్ధినీరాదటో లక్షణముగ
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 97

ఓ భాస్కరా! తేనెటీగ తేనె సమకూర్చుకొనునప్పుడు తనలక్ష్యమును విస్మరించక ఇటనట చూడక పూతేనియలకై పరుగులిడును. పేడ పురుగు జన్మకర్మ ననుసరించి పేడయందున్నను దాని మలినమును తనకు అంటనీయదు. ఇసుకయందున్న పంచదారను వేరు చేయును. మానవ జన్మ ఉత్తమమైనది మంచి చెడు, సత్తు అసత్తు, గ్రహించగలది. కావున ఈ నశ్వరమైన శరీరముపై అశాశ్వత బంధములపై మాయా నిర్మిత ఇహముపై, మోహము వదలి విషయ వాంచలు అంటకుండా నిన్ను జేరుట అను లక్ష్య సాధన మరువకుండ సాధన చేయు లక్షణములనిమ్ము. జనన మరణ చక్రమునుండి బయట పడవేయుము తండ్రీ

అఘటనా ఘటనుడవన్ననయ్యది స్వభా
వోక్తిగాని యతిశయోక్తి కాదు
సకల చరాచర సంస్థితుడవనుట
ఉత్ప్రేక్ష కాదది యున్న మాట
పోల్చుట సరికాదు పొసగునొక్కటనగ
నీవు నేనెవరన్న నిజమునరయ
అవయవగతుడౌచు నవ్యయుడననుట
నేను సగుణుడైయ్యు నిర్గుణుడని

తెలియు తెలివిని పొందంగ దేవ దేవ
చూడదగినది చూడంగ చూపు నిమ్ము
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 98

ఓ ఘృణి సంజ్ఞా! నీవె అన్ని ఘటనలకు మూల కారకుడవు. చరాచరములందు నివసించు వాడవు. నీవు నేను ఒకటే అనునది సత్యము. నిరాకారము నిర్గుణము శాశ్వతము నీ లక్షణములు. ఈ మాయా లోక మోహములను తొలగించి సత్యమును తెలిసికొను శక్తిని ప్రసాదించి నాకు జ్ఞానమును కలుగజేయుము స్వామి.

**మందేహ దైత్యుల సందోహమును బాప**
**నర్ఘ్యమ్ము నిమ్మని యడుగు లీల**
**విహిత కర్మల చేయ విస్మరించగనీక**
**సద్వర్తనము నేర్పు చారు చర్య**
**స్వామి కష్టానికి భక్తుని స్పందన**
**తిన్నని భక్తిని తేట బరుచు**
**సందిగ్ధ సంధ్యలో సంశయ క్షాళనే**
**తిమిర హరమనుచు తెలుపు సొగసు**

**అంతియేగాని పరమాత్మకాపదనగ**
**దివ్య తేజమ్ము ముందర తిమిరమట్లు**
**భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద**
**దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ** **99**

ఓ దేవా! మందేహ రాక్షసుల సమూహమును పారద్రోలుటకు అర్ఘ్యమిచ్చుట ఆచారము. ఈ నిత్య నైమిత్తిక కర్మ సత్ప్రవర్తన అలవడుటకు. స్వామీ నీకు కష్టమేమిటి నేను బాపుట ఏమిటి. సందిగ్ధ సమయములలో నిన్ను పూజించిన యీ లోకమందుగల సందేహములు రూపుమాపుట నీ లీల. ఇది నా అజ్ఞానము తొలగించుటకు ఒక జ్ఞానభిక్ష. నా దివ్యతేజమును నాపై ప్రసరింపజేయుము స్వామి.

రధ బంధం

మధ్య నిలువు " అనంత కృష్ణ భాస్కర శతకము"

అవునంతియే గీతలన్నియు స్వీయాకృ
తిం దప్పి యే మృగతృష్ణ వెంట
పరువెత్తి సోలక భాసుర పరిపూర్ణ
నిరుపమహస్కర నియతి నిల్వ
శుభచిహ్న సారమై శోభావహమ్ములై
నిల్చు శక్తిని పొంద నీదగు దయ
తప్ప యితరమెద దలప కన్పట్టదు
ముఖ్య గుణమటుల ముఖము పైన

ముచ్చట నుదుట వ్రాయక మునుపు దేవ
నతులు గొని సమ్మతిని జూపుమతులితముగ
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 100

ఓ భక్తవరద! నినుకొల్చిన నీ దయవున్న నుదుటిగీతలు తమ ఆకృతిని మార్చుకుని దోషవర్జితములై సర్వ శుభంకరములుగా మార్పుచెందును. నా యీ నుతిని స్వీకరించి సమ్మతిని కలుగజేయుము తండ్రీ.

# రథ బంధము

(100వ పద్యము)

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | | అ | | | | | | |
| | | | | | వు | నం | తి | | | | | |
| | | | | యే | గీ | త | ల | న్ని | | | | |
| | | | యు | స్వీ | యా | కృ | తిం | ద | ప్పి | | | |
| | | యే | మృ | గ | తృ | ష్ణ | వెం | ట | ప | రు | | |
| | వె | త్తి | సో | ల | క | భా | సు | ర | ప | రి | పూ | |
| ర్ణ | ని | రు | ప | మ | హ | స్క | ర | ని | య | తి | ని | ల్పు |
| | శు | భ | చి | హ్న | సా | ర | మై | శో | భా | వ | హ | |
| | | మ్ము | లై | ని | ల్చ | శ | క్తి | ని | పొం | ద | | |
| | | | నీ | ద | |  | | గు | ద | | | |
| | | | | య | | | | త | | | | |
| | | | | ష్ప | యి | త | ర | మె | | | | |
| | | ద | ద | ల | ప | క | స్వ | ట్ట | దు | ము | | |
| | | | ఖ్యు | | | | | | గు | | | |
| | | ణ | మ | టు | ల | ము | ఖ | ము | పై | న | | |

3. భా-స్క-రా
ది-త్య-ఘృ-ణి-
సం-జ్ఞ-భ-క్త-
వర->

1.->చ్ఛ-ట-
ను-దు-ట-వ్రా-
య-క-ము-
ను-పు-దే-వ

4. ది-వ-స-క-ర
-వ-రే-ణ్య-స-
వి-తా-తి-గ్మ-
కి-ర- >

2.-> తు-లు-గొ-
ని-స-మ్మ-తి-ని
-జూ-పు-మ-తు-
లి-త-ము-గ-

పదముల గుప్పించి పదుగుర మెప్పింప
పద్య రచన జేయ, ఫలితమేమి
పగతురు నాలోన వలదన్న వదలరు
వార లార్గురె యైన పోర లేను
పరిపరి విధముల పరిగిడు నా మది
నేవిధి గెలుతును ఎయ్యది గతి
పరుగులు వారించి సరగున నిను గన
చిలికిన భావన చిలుక పలుకు

స్వీకరించుము నా నమోవాకములను
మోకరిల్లెద నీవుండ నాకమేల
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 101

ఓ దయాహృదయ! కామక్రోధాది శత్రువులు నన్ను వదలుటలేదు. వాటిని నేను జయింపలేకున్నాను. నిరంతరము మనసు పరుగులు పెట్టుచున్నది. దానిని నిగ్రహించలేను. దాని వేగము తగ్గించి నిన్ను చేరవలెనని చిన్న కోరిక వున్నది. కావున ఓ దేవా నీ పాదములపై పడి మ్రొక్కుచున్నాను. నా మనసులోని పదాలను పద్యాలుగా వ్రాసి నీకు సమర్పించుచున్నాను. స్వీకరింపుము. నీ దయలున్నచో స్వర్గముతో పనిలేదు కదా.

అప్పయ్య దీక్షితుడమిత భక్తిని గూర్చె
నీపైన స్తోత్రమ్ము నియతగతిని
భట్టమయూరుండు బహుశోభలను పల్కె
నీమీది శతకమ్ము నేర్పు తోడ
ఎందరో కవి భక్తులేంతయో స్తుతియించి
రానంద మందించి రందరకును
దివ్య భావాల దీధితి జగతి వెలయ
పొల్పార బంగారు పుష్పములుగ

చేతనైనట్టు చెప్పితి స్వీకరించు
కాళ్ళ కడనుంచితిని కొన్ని గడ్డి పూలు
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 102

ఓ భక్తవరద! సంస్కృతమందు అప్పయ్యదీక్షితులు భక్తితో నీపై స్తోత్రమును రచించెను. మయూరుడు శతక రచన గావించెను. ఎందరో కవులు వారి రచనలతో నిన్ను వర్ణించి సార్థకత పొందినారు. నీ దివ్య పాదములవద్ద బంగారు పుష్పములు వారు సమర్పించినారు. గడ్డిపూలవంటి యీ పద్యములను భక్తితో సమర్పించుచున్నను. దయతో వీనిని కూడా స్వీకరించుము స్వామీ.

సర్వ కారణ భూత శక్తిగా గురునకు
విన్నపాలొనరించి వేయి మార్లు
లాలించి పాలించు లలితాఖ్య రూపుకు
నోరార శతపద్య నుతులు జేసి
వరదాయక కనరా ద్విరదాననా యంచు
ఉత్పలమ్ములనిడి తత్పదాల
నావైన భావాల నీ వెల్గులను గూర్చి
శబ్దార్చనమ్మిది శతవిధాల

ఉంటివీరీతి ప్రియమార మింటి రేడ
కంట కనిపెట్టి నను నీవె కాచుకోర
భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద
దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ 103

ఓ భాస్కర! ఓ ఆదిత్య! ఓ ఘృణీ! ఓ భక్తవరద! ఓ దివసకర! ఓ వరేణ్య! ఓ సవితా! ఓయీ తిగ్మకిరణ! గురువును సర్వ కారణ భూత శక్తిగా తలచి సహస్రనామములు రచించినాను. నన్ను లాలించి పాలించు లలితాంబను వంద పద్యాలతో కొనియాడినాను. వరములనిచ్చు వినాయకుని శతపద్య పద్మములతో అర్చించినాడను. ఇపుడు నీకు ప్రియముగా శబ్దార్చన చేయుచున్నాను. దోషములను పరిహరించి నన్ను కాచుకొనుము తండ్రీ


భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్తవరద
దివసకర వరేణ్య సవితా తిగ్మకిరణ